హిత గ్రంథమాల * (౧౧)

# ప్రజాపాద్యాజి. గుంటూరు జిల్లా తీర్పు

అధ్వర్యువ్యవహార దర్పణము



రచన అండ్ ప్రచురణ

దేశభక్త వోలేటి సుబ్రహ్మణ్యశర్మ

పబ్లిషర్ : దేశహిత గ్రంథమాల, తెనాలి.



1957

చందాదారులకు ఉచితం
ఇతరులకు రు 1/-



విశ్వకర్మా దిశాంపతిః స నః పశూన్ పాతు,
సోఽస్మాన్ పాతు తస్మై నమః



త్వష్టా జాయా మజనయత్, త్వష్టాఽస్యై త్వాం పతిం ।
త్వష్టా సహస్ర మాయూంషి, దీర్ఘ మాయుః కృణోతు వామ్॥

---

N. B. :- "స్థపతిర్విశ్వకర్మేతి శ్రుతిస్మృతిభిరీరితః । యశ్చైత్ర ద్వైవస్థపతి మంశజం విశ్వకర్మణః॥ యత్ర కుత్రైవవా వాస్తుపురుషం పూజయేద్యది తద్భావేన యశే ద్విశ్వకర్మ బ్రాహ్మణ శిల్పినమ్॥"

(విశ్వకర్మబ్రాహ్మణ వంశాగమము, శిల్పకాండము ౨౦౧ పుట)



బ్రహ్మశ్రీ పండిత బండికట్ల వెంకటరత్నశాస్త్రిగారు

ఆయుర్వేదవైద్యముచేతను, విజ్ఞానశాస్త్ర ప్రబోధముచేతను
ఆశ్రితజనకల్పభూజములుగ ప్రకాశించుచున్నవారు.

ఇనమనమెళ్ళూరు. ఒంగోలు తాలూకా



గ్రంథకర్త

# పరిచయము.

దేశభక్త: వోలేటి సుబ్రహ్మణ్యశర్మగారు సారస్వతైక విమర్శ కృషిలో చాల వత్సరాలుగా నిమగ్నులై సాంఘికదృష్టితో ఏతద్విమర్శనము చేయుచూ వచ్చినవారు. వారు ప్రారంభములోనే కవిరాజు త్రిపురనేని (బారెట్లాప్రస్తుతి) మన్నన పొందినవారు.

''దేశహిత ప్రదీపిక'' అను నాలుగు సంచికలలో వారి సునుచిత విమర్శలను లోకవిదితం చేశారు. ఇప్పుడు 'విజయధ్వజ' నెత్తారు. వారు సాంఘికదృష్టితో సాహిత్యవిమర్శకు దిగి పూర్వులు సాహిత్యోపాసన పేరుతో చేసిన, ప్రచారించిన కొన్ని సాంఘిక అసమతాభావాలను, న్యూనతకల్గించు వాదములను విమర్శాత్మక పరామర్శతో చదువరులకు చూపి విమర్శదృష్టికి అవసరమగు సాంఘిక, చారిత్రక దృష్టిని గూడా మొలకలెత్తించారు.

ప్రస్తుత ప్రచురణ 'స్వర్ణకార వ్యవహారము' అనే (పద్య) గ్రంథ పరిశీలనము ధర్మశాస్త్రస్థితిగూడా యిందులో గోచర మాతుంది. పట్టణాల్లో చేరి యీ రకపుదృష్టి యింకా యెందుకు? మనం సాంఘికంగా యెంతో మారిపోతిమి! అనేవారికి అసలు దేశంలోని స్థితి బోధపడలేదని తెలియజేయటానికే యీ ప్రచురణ. ఈ శతాబ్దారంభలోని కవితాహంకృతి యిందులో గోచర మాతుంది, ఉపాలంభన కార్యాల్లో తామెట్లు వాడినది తెలుస్తుంది.

ఒక కోర్టు తీర్పు, అపీలు తీర్పుల పరిశీలనతో నేర్పడిన సాంఘిక సమస్యలను ముందుకు తెచ్చి ధర్మశాస్త్రాన్ని తఱచి వాటిని కులతత్వశాస్త్రంగాని, ధర్మశాస్త్రం కాదన్న (నిజానిజ) నిరూపణకు పూనుకొని 'వైదిక' 'విశ్వకర్మ' విశ్వబ్రాహ్మణ మొదలైన శబ్దోత్పత్తి విలిఖించిన గ్రంథము.

వర్తమాన సాంఘికస్థితిలో అవ్యవస్థ ప్రధానంగా కనఁబడు తుంది. దానికి రూపం, స్థితి, నీతి, రావాలి. దానికి మార్గేతర మార్గాలున్నా ప్రాయికమైన విలువలు, సూత్రాలు వుండాలి, అయన్వేషణ నేటి ఆవస్యకత. తీరులో మార్పు యెంత అవసరమో శ్రద్ధాసక్తి గల పాఠకులు గ్రహింప నర్హులు. ఆ కదిలికకు కారణ భూతుఁడైన మన రచయిత కృషి ప్రశంసార్హము.

తెనాలి }
12-9-57 } (సం) ఆవుల గోపాలకృష్ణమూర్తి M.A.LL.B.
అడ్వొకెట్

# అభిప్రాయము

జగంబెఱింగిన బ్రాహ్మణునకు జందెంబెందుకన్న ట్లీవిజయధ్వజి గ్రంథకర్త, దేశభక్త: వి. యస్. శర్మగారిం గూర్చి పొగడికతోఁ బనిలేదు. వీరాధ్యాత్మిక సేవయందుకూడ 'ఓంనమశ్శివాయ పంచాక్షరగేయము, శ్రీకనకదుర్గాంబదండకము మొదలైనవి రచియించిరి. "దేశహిత ప్రదీపిక" మొదలగు స్వరచనలేగాక ప్రాచీన మహా కవులయొక్కయు, ఆధునిక శ్రీ శ్రీమాష్టరు జి. పోలయ్యపిళ్లేగారి వంటి మహాశయులయొక్కయు రచనంబులఁ బ్రచురించుట మూలంబున "దేశహిత గ్రంథమాల"ను విశాలంబొనర్చుచున్నారు.

కోట్లకొలఁది ధనవ్యయముతో భూగర్భపరిశోధనచేసి వెలువఱచంగల్గుచున్న శిల్పాలు, శాసనాలు ఎంతముఖ్యమో అంతకన్న నెక్కుడు గ్రంథభాండాగంబుల నెలకొనియున్న కళంకాస్పదములైన గూనుపురాణీలవంటి గ్రంథసంచయంబును విమర్శించి యందున్నా సత్యాన్వేషణంబున నాగఫణంబులందలి మణులను, కోరలయందలి గళంబును విడఁదీసి లోకంబున కర్పించినట్లొనర్చిన యీ "విజయధ్వజి" వంటి ప్రచురణంబులు ముఖ్యంబులనక తప్పదు.

"హిందూలాను ధిక్కరించి యే సంసారియైన నేమిచేయం గలఁడు? కాగా సామాన్య వ్యక్తుల దగ్గరనుండి ఉన్నత న్యాయస్థానాధీశుల వఱకు నాధర్మశాస్త్రమునే యాధారముగ గైకొని వ్యవహరించుట గల్గుచున్నది. కావున శాస్త్రీయంబగు వేదాదులం గనంబఁ చున్న బ్రహ్మర్షి సంప్రదాయ బ్రాహ్మణులెవ్వరు? తదితర సంప్రదాయ ఋషుల వంశులెవ్వరు? అనే గడ్డుప్రశ్నపై నీ "విజయ ధ్వజి" 80వ 81వ పుటలందు నిరుపద్దట వంశ వృక్షమును జూపుట గల్గినది. మఱియు 87 పుట 17–24 పంక్తులు వివరించుట గల్గియున్నది. నిజంబునకు బ్రహ్మర్షి సాంప్రదాయ బ్రాహ్మణులై యున్న విశ్వకర్మ – విశ్వ – శిల్పబ్రాహ్మణులనంబడువారే అంతటా విద్యాగురువులై, పౌరోహితులై, (పౌరహితులై) గ్రామకరణీకము మొదలు రాజప్రతినిధి (89 –వ పుట) వఱకు పాలించిన రోజులలో నింతటి వక్ర, స్వార్థ, దూరభిమానంబుల నిలయంబై యున్నట్లు లేదు. ఇప్పటికిన్నీ వారు గ్రామకరణీకాది వివిధోద్యోగంబులలో నున్న ప్రదేశంబులందు "చందనతరు న్యాయం"బగు వారి స్వార్థ రహిత దేశసేవ ప్రత్యక్షంబగుచునే యున్నది.

"వేదవిప్రులెల్ల విశ్వోపకారులై సాక్షినున్నవారు జగతిలోన, సంకరకుల ద్విజుల్ సర్వోక్తులౌదురా? విశ్వదాభిరామ వినుర వేమ" యన్న సూక్తి అక్షరంబుల సార్థకంబగుచున్న యీ శతాబ్దిలోనే ఒకానొక వైదికి ప్రతిష్ఠాదాయంబందలి తృణద్రవ్యాకాంక్షచే క్రోధోద్రేకంబుల బెంచి క్రిమినల్, సివిల్ కోర్టుల కెక్కి సుప్రసిద్ధ న్యాయవాదులచే శృంగభంగంబొందియు నింకను లోకంబును తారుమారొనర్ప లిఖించిన" స్వర్ణకార వ్యవహారం" బను కావ్యధోరణిని బటాపంచలు గావించుటతో యనేక మహా పండితోత్తముల వ్యాఖ్యాదులేగాక అనేక శిలా, తామ్ర శాసన

చరిత్రామలుకూడ బ్రకటించుటచే నీ "విజయధ్వజి" గ్రంథకర్తకు-అనగా భాషాసాహిత్యోన్నతిలో కూడ నేర్పడిన యనర్థ దుష్ప్రచారాంధకారంబును బోకార్చి దేశసౌభాగ్యోన్నతి కగు సత్య ప్రభాప్రసార చరిత్రావలోకనంబు గల్గించిన శ్రీ వి. యస్. శర్మ గారికి విజ్ఞానలోకం బెంతయు ఋణపడియున్నదనుట విశేషోక్తి కానేరదు. కావున నింకను చేదోడు వాదోడుగనుండి దేశీయ వైజ్ఞానికంబులైన యిట్టి రచన లింకను వెలువరింపజేయ ప్రోత్సహించెదరుగాక యని తలంచుచున్నాను.

| | |
|---|---|
| డాక్టర్: | ఇట్లు, |
| స్వర్ణ కంకణౌషధాలయం | కవిరాజ్: సత్యాల నరసిబాబుపాత్రుడు |
| విజయవాడ 20-9-1957 | (గాంధీజీ అమరపట్టాభిషేకాది బహుగ్రంథకర్త.) |

# స్వవిషయము

రెండవ సంపుటి "విజయధ్వజి" యని ప్రకటించి కొన్ని పుటలు ముద్రింపించియు నాపివేసి మఱికొన్ని చిన్న, పెద్ద పుస్తకాలు ప్రచురించుచు "శ్రీ వీరబ్రహ్మ లీలామృత సంపూర్ణ జీవిత చరిత్రం" బను సుమారు 500 పుటల గ్రంథరాజమును ప్రారంభించి కొంతవఱకు అచ్చొత్తించగల్గి యుంటిమి. ఇంతలో బ్ర॥ యస్. పాపయ్యశాస్త్రి (డిప్యూటి ఇనస్పెక్టర్ ఆఫ్ స్కూల్సు, జగిత్యాల) గారు విషయము నారసి తమ విజ్ఞప్తితోపాటు ఏబదిరూప్యముల విరాళం బొసంగి ప్రోత్సహించుటచే శ్రీవారికి కృతజ్ఞత దెల్పుచు చాలకాలము క్రిందటనే మహారాజపోషకులై విరాళం బొసంగియున్న బ్ర॥ కే. మైలారాచార్యులు (ల్యాండు లార్డు, మలయనూరు) గారికిని, తొలినుండి తృప్తికరములైన సలహాల నొసంగుటతోపాటు మహారాజపోషకులైన బ్ర॥ పండిత బండికట్ల వెంకటరత్నశాస్త్రి గారికిని, మఱియు పోషకులైన, సహాయులైన, అభిమానులైన, చందాదారులైన మహాశయులందరికిన్ని మదీయ కృతజ్ఞతానేకాభివందనంబు లొనర్చుచు నిట్లే శ్రీ వీ॥ లీలామృత సంపూర్ణ జీవిత చరిత్రముకూడ నచిరకాలములో పూర్తిచేయగలమని మనవి యొనర్చుచున్నాము.

ఇట్లు పబ్లిషర్ : డే. గ్రం.

శ్రీ గురుభ్యో నమః

శ్రీ గుంటూరు అడిషనల్ డిస్ట్రిక్టు మునసబు కోర్టు తీర్పు

# విజయధ్వజి.

## (ఆధ్వర్యవ్యవహారదర్పణము)

ఆ సేతు హిమాచలపర్యంత పుణ్యభూమిపై ననేక గ్రంథాలయంబులు గల్గి, యందలి గ్రంథసముదాయ మెల్ల యెడల పాఠక లోకంబున కందుబాటుగను, అతి భద్రంబుగను నుండుటకు ప్రభుత్వ సహాయము గూడగల్గుచున్నది. కావున నా యా గ్రంథకర్తలు దేశ హితాఽహితా ఽభ్యున్నతులకు శాశ్వత కారకులగుదురనుటకావంతయు సందియంబుండ నేరదు.

అహితగ్రంథంబు లెప్పటి కప్పుడు విమర్శింప వలసినవియే యైనను కొన్ని యెడల నట్లు జరుగుటలేదు. ఉదాహారణంబునకు "స్వర్ణకారవ్యవహారం" బను అక్రమనామ, ఆత్మస్తుతి, పరనిందలతో గల డెమ్మీ 1/8 సైజు 310 పుటల పద్యకావ్యంబొకండై యున్నది. చూడుడు.

అయ్యది 1910సం॥ము గుంటూరు జిల్లాలోని "జానపాడ"ను గ్రామంబున నా గ్రామకరణము, మునసబు, పెద్దకాపు వగైరా వారో నర్పించిన గ్రామదేవతాపునః ప్రతిష్ఠసందర్భమునందు నధ్వర్యుండైన (కృష్ణాజిల్లా-తా॥కా॥నందిగామ) బ్రహ్మశ్రీ వోలేటి లక్ష్మయ్యా మొదలగు పదుగురిపై నా గ్రామవాసియే యగు జానపాటి పట్టాభిరామ శాస్త్రి యను నతడు క్రిమినల్, సివిల్ కోర్టులందు వ్యాజ్య మొనర్చియు, పర్యవసాన తీర్పులను, ఆయా న్యాయాధీశులను, తుదకు

సాక్ష్యులను గూడ విడువక తెగడుచు వ్రాసి ప్రచురించియున్న కడుం గడుగొప్ప కావ్యంబగుటచే నతి తీవ్రవిమర్శకుగురియైనది "సుగుణేన గుణోద్గ్రాహ్యోహంసః క్షీరమివాంభసి" యను నార్యోక్తిగా నందలి నిజానిజంబులనిట నాయీ అధ్వర్య వ్యవహారదర్పణంబున నిరూపించి విమర్శింపం బూనుకొని నందులకు విజ్ఞులు హర్షించెదరు గాక యని తలంచుచున్నాను.

తొలుదొల్త నా వాదియు, కావ్యకర్తయునగు జానపాటి పట్టాభి రామశాస్త్రి తన వ్యవహార మందలి వక్రతను గప్పిపుచ్చ నెంచుచు వ్యక్తిగతముగా సత్యము నధిగమించి వ్రాసి యున్న తెఱంగుంగాం చుఁడు.

ఉ॥ వైదికుఁడయ్యుఁ గాలమును బట్టి యొకించుక లౌకిక ప్రథన్
బోఁబోఁడగంగఁ గొందఱకుఁ బుట్టె నసూయ వ్యగ్రతన్ మైఁ
భేదములంకురించి యిటు పెద్ద పెఱుంగఁ గ్రమక్రమమ్ముగన్
వాదములాడఁ జొచ్చి రిరువాగుల గొంతిజనంబు తోడుగాన్ (స్వ-ప్ర15)

వైదికుండయ్యూ, తన సహోదరుండు కాలమును బట్టి కొంత లౌకిక వృత్తితో (పైరివేటుపనితో) ప్రవర్తించుచుంటచే కొందఱకు నసూయా పాత్రుండై పెద్దపెట్టు వాదులాటలకు గురియయ్యెనఁట. అందుచే-

మ॥ మునుపే ముక్కిడిగాఁగఁ బైని పడిసెమ్ముంగల్గ నట్లంతనీ
యనయ వ్యూహము పైజపైపెలయు బ్రహ్మద్వేషమత్యంతమై
తనరం దానికి తోడుగాఁగఁ గలిగెం ద్వాపస్టారిళి సఖ్యంబునున్
గనుగొన్నెట్టిరి కట్టివారి పయి నేగఁల్గంగదా కూయముల్ - (స్వ.ప్ర 16)

కం॥ ఈమాడ్కి మామకీయ గ్రామ స్థితులుండి యుండి కడకొక పటి దు
ష్ప్రామాణ్యమైన కార్యము కామించి యొనర్చిరకట కలిమహిమమునన్(స్వ17)

తన సోదరుని నవ్యపైరివేటు చర్యలను సయితము సమర్థించుచుయొరులనిందింప సాహసించుటచే తాను గూడ గ్రామకంటకమున ద్వేషభూయిష్ఠుండై యుండిన నుండవచ్చును. గాని దాన బ్రహ్మద్వేషమత్యంతంబైన దనుటకవకాశమున్నట్లు లేదు-ఎందువల్లననగా- ఆగ్రామ కరణము మొదలగు ద్విజులెందరో పుర ప్రజల భక్తి శ్రద్ధల

జూరగొనుచునే యున్నారు-మఱియు నెల్లప్పుడునూ తలలో నాలుక వలె మెలంగు త్వాష్ట్రిసఖ్యత అప్పటికప్పుడే గల్గిన దనుటకు గూడ నవకాశముండదు. ఆగ్రామశ్రేయమునకై కరణము, మున్సఫ్, పెద్ద కాపు మొదలగు ప్రముఖులు కోటి కావింపనున్న ఘనకార్యమునే యితఁడు దుష్ప్రమాణ్యకార్యమనియున్నాఁడు. వారి ప్రయత్నమును గూర్చినుడువు తెలుసుంగనుఁడు.

చం॥ పెనుకటి దేవతా శిలల విగ్రహరూపము లేకయుండఁగా
వున నవ విగ్రహమ్ములకుఁ బోవలె "దుగ్గి" కటంచు బోయి యా
పని నెఱవేర్చి యాజకుని బ్రాహ్మణుఁ జేయుటకున్ సహింప కొ
క్కని రఘు కారుఁ డెచ్చుటకుఁగా జతనంబులు సేయుచున్నాడన్ (స్వం.ప్ర 25)

"దుగ్గి"యను గ్రామంబునకేగి క్రొత్తవిగ్రహములను తెచ్చి పూర్వ పరిస్థితులెఱింగిన వారగుటచే అటులనె విశ్వకర్మబ్రాహ్మణుని యాజకునిగ దెచ్చుటకు యత్నించుచుండగా ఈకవి సోదరుఁడు తమ సంబంధ బ్రాహ్మణుండతఁడు కానందుల కయిష్టుండై చేసిన కృషి నెఱింగించుచున్నాఁడు.

ఉ॥ అప్పని మత్సహోదరుని యాత్మకు నిష్టముగాకయుండ్కిఁ దా
జెప్పిన "శత్రుభావమునఁ జేకొన"రంచుఁ దలంచి చప్పునన్
బప్పు సుదర్శనాఖ్యబుధు పాలికినేగి యుదంత మంతయున్
విప్పి వచించి యాబుధుని వేగమపంపఁగ వారి మ్రోలకున్ (స్వ-26)

పప్పుసుదర్శనాహ్వాయునకీవిషయమంతకు పూర్వము తెలియనిదికాదు. కాని అతనికదిఅభావమని, శత్రుభావమున తనమాటనంగీకరింప రని ఏమేమిగొ విప్పిచెప్పి యా గ్రామపెద్దలకడకు నాతనిని పంపగల్గగా

కం॥ ఆ పండితుండు కరణము ప్రాపుననున్నట్టి కాపువారిని గని తాఁ
గోపంబురానియటువిశిధోపాయములన్ వచించెనుడుగుండనుచున్

పండితుఁడైనను తను చెప్పెడి మాటలకు యెదుటి వారికి కోపము వచ్చునేమో యను భయంబుననే అనేకోపాయములతో వారి యా ప్రయత్నము మానవలెనని వచించినను ప్రయోజనము గలుగనందు

సంగాబోలును తంగెడ రామకృష్ణకవియను మఱి యొకండెట్లో చెప్పి వారి సంకల్పమును మార్చఁగల్గి నట్లీక్రింది పద్యము

ఉ॥ తంగెడ రామకృష్ణ కవి తక్షణ మప్పనినుండి వారి ని
ర్భంగి మరల్చి చెప్పి చనె "వస్త్రలు నొక్కరుఁడల్ల తొండపిన్
లైంగుఁడు బ్రాహ్మణుండును గలాడిదుఁ డాగమవేత్త" యంచు, నా
సంగతి విన్నమీఁద నటుసల్పిరి తోడ్కొని రా బ్రయత్నమున్ (30

నూతన పైవ్రేటు పలుకులు ఒకరిద్దరు ఘనులు విశేషముగ జెప్పుటచే నా గ్రామోద్యోగులు మొదలైన వారు పూర్తిగా నైదొలగి ఆకార్య భారమంతయు వీరిపైనే వేసినట్లును ఈకవి, వీరిబంధుమిత్రులై సర్వము నిర్వహించినట్లును ఈ క్రింద నెఱుంగవచ్చును.

ఉ॥ అప్పుడు మత్పితృవ్యునకు నాత్మజుఁడైన చినప్పయాఖ్యతోఁ
జెప్పి సహాయుఁ గాఁగఁగొని శీఘ్రమ తొండపి కేగి యాద్విజున్
గొప్పగ దోడితెచ్చుటయు నూతన విగ్రహసంస్థ యాబుధుం
డొప్పినరీతిఁ జేసి తమయూరికిఁ దాఁ జనెనొంది సత్కృతుల్ (31)

"తొండపి" యనుగ్రామంబునుండి గొప్పగ గొనితెచ్చిన లింగధారి బ్రాహ్మణుఁడు విగ్రహసంస్థనెరపి సత్కృతులనంది చనెనని చెప్పుచూ విగ్రహఘట్టన సందర్భమునందు గిన్నెలబ్రహ్మయ్య యను శిశ్వ బ్రాహ్మణునే బిలిచినట్లును అందుపై గావించిన రీతియు గమనింపందగినది.

చ॥ పిలువఁగనయ్యె నాతని నె విగ్రహఘట్టనమాచరింపఁగన్
"సలిపెద నాకుఁ గాఁదగిన సత్కృతియయ్యెడుచో" నటంచు నా
ఖలుఁడు వచించె, "చూచెదము కార్యము సాఁగఁగని" మ్మటంచు న
న్నలుఁగురుపల్కఁ, దప్పు దహుని నాయకమాట నెవండొ సంగెడున్ (34)

తనకురాదగిన సత్కృతినే కోరినయతండు "ఖలుండఁ"ట! అందుకు సరియైన సమాధానంబైనఁ జెప్పకుండ ఊరకయే కార్యము "సాగనిమ్మని" వచించిన యా యనామక నాయకమ్మన్యులనేమనవలయునో పాఠకులూహింతురుగాక – వారటులనే మఱలమఱలం బిలుచుచుండుటచే గాబోలును.

ఆ॥ అంతమీఁద నాతఁ"డరుదెంతు నరదెంతు"ననుచుఁ జేసి రాక యట్టెయుండ
దూరదృష్టిలేని మోఱకులైన మావారుమరలఁ బిల్వఁ బోరలైరి. (35)

ఈ కవి "దూరదృష్టిలేని మోరకులైన మావారు"అని చెప్పు కొనుచున్నాఁడు. దూరదృష్టికలవారైనచో తక్షణము ఘట్టనచేయించు తురనియు. అట్లయిన తమ నేరము ( యంత్రము లపహరించుట ) బయల్పడఁ జాలదనియు నీతని యూహ కాఁబోలు. కార్యభారమంతయుఁ దనపై నుండిన రాజకుఁడు స్పష్టముగనె చెప్పుచున్నాఁడు.

చం॥ "అదిగనిపల్కె రాజకుఁ"డహా!యిది యేమిటి,యంత్రయుక్తమై
నని మఱి హేమపు బలక యయ్యెనియేరుహరింత్రో, కావునన్
గుమురుగ ఘట్టనం బగుట గూడును విగ్రహ"మంచు మాటికిన్
సదయితఁ జాలఁగాని యటుసల్పక రో చనిరెల్లవారలున్. (36)

అనిరో త్యాగశీలకులైనచో ఘట్టన యథావిధిగ జరిగి యుండెడిది. బంగారు రేకులచే "ఏరుహరింత్రో" అనియు; ఘట్టన చేయించక పోయిరి. ఆ పాఱులె బంగారురేకుల దొంగలించినట్లు ముందటి కథవలనఁ దెలియఁగలదు.

కం॥ అయ్యోడనటులేగిన బ్రహ్మయ్యకు దయయుదయమై తనంతటఁ దానే
"అయ్యా! రిగియింతిమురం! డయ్యోడ" కనికొన్నిదినములరిగినమీఁదన్. (37)

పలుమారతని పిలుచుచుండుటయు నా బ్రహ్మయ్య 'అ రు దె ం తు న రు దె ం తు' ననుచుండుటయు రెండుమూఁడు పద్యములలోనె యీ కవిమఱచెనా! బహునాయకత్వమనిచెప్పిన తానే తనవారుపిలువకుండినమఱియెవ్వరును పిలచియుండరని మతిభ్రమపొందెనా!

ఉ॥ కాన్పులఁదోడికొంచుఁ జని ఘట్టనసేయక యున్నవున్నటుల్
లే పను విగ్రహంబులను రేకులయుక్కు పరీక్షసేయఁగన్
బాగ్యచన యంత్రము లు, చూపఱయాగ్రహమందుచుండగన్
'బాసలు తీసి'రిస్నగల బ్రహ్మమునేల్చె స్వయుక్తిచాతురిన్ (38)

ఆ॥ అందుమీఁదు మూ[illegible] [illegible] 'రాజకుఁడు చినప్పయయును గతిని
తీసి'రనుచు మిగులఁ [illegible] సాగించి యు[illegible]టపటు [illegible] మతి శయిల్ల. (39)

యంత్రపు బంగారు లేకులెవ్వరు తీసినదియు నచటనుండిన పెద్దమను ష్యులు తేల్చుచుండఁగా బ్రహ్మయ్య స్వయుక్తి చాతురితోఁ దేల్చవలసినదేమి యున్నది. గ్రామములో నెవరి స్వభావమెట్టిదో ఆ గ్రామము పెద్దమనుష్యులకుఁ దెలియునుగదా! అట్టివారిని మూర్ఖులని అవరజులని వ్రాసెడి యితనిమూర్ఖత్వమేమిటది? మఱియు నా గ్రామమునందలి కమ్మవారింగూర్చి వ్రాసినపద్యము

ఉ॥ తిట్టుటు మాయమాటయిట దెబ్బలుగొట్టుటు మాదుగ్రామముఁ
గట్టిన నాఁటినుండియును గమ్మకులస్థులకుగ్గుపాలతోఁ
బెట్టిన, దద్ది యొక్కొకరిపైఁ బ్రయోగము చేసినప్పుడ
ట్టిట్టులఁ జేయుఁ, నొక్కెడ నేమియుఁ జేయకపోవుచుండెడున్. (48)

ఈతని అన్న లౌకికవృత్తియందు బ్రవేశించుటచే నితనికి గలిగిన జ్ఞానముకాఁబోలు నిది. ఇందులకు నిష్ప్రయోజకమగు క్రిమినల్, సివిల్ సంబంధ మూఁడు ఉదాహరణములు ఇచ్చినాఁడు. పోలీసుచార్జి మొదలు అడిషనల్ జడ్జికోర్టువరకును వ్యవహారమును జరిపి శృంగభంగమై ఏమోబరిగించినట్లు"స్వర్ణకారవ్యవహార"మని తన నైజమును తెలిపెడియొక గ్రంథమును సైతమురచించిన యితఁడు, యితనిపోడి వారు నెట్టివారోయూహించుఁడుఆయూరికమ్మవారును, పురప్రజలును శ్రేయోదాయకులనియు, సత్య వాదులనియు నితని పద్యములలోనే తెలియవచ్చును. చూడుఁడు

ఉ॥ 'మేలొనగూడఁగంబ్రజకు మేమొనరించెద మిష్టకొల్వులన్
జాలధనంబు గావలెను జాగొనరింపకయిం" డటంచుఁ జం
దాలువసూలుఁజేసి యొకతక్షకుఁ డోడ్కొని వచ్చిరప్డు యం
త్రాలను వేయగన్ మరలఁ దద్దఁ డొకండును లేక యుండుటన్. (49)

(కడుపు మంటచే)యితరుల నొకటని పదిపడుట యితనినోసటివ్రాత కాఁబోలును ఇంకనునితని పోకడంగాంచుఁడు.

ఉ॥ చూపితివ్వాగ్యపున్ నుడుల సుంతయు నిష్టము లేని భావమున్
నాపలుకుల్ గ్రహింపఁగల నాథుడులేఁడట, నింతకన్ననున్
గోపవిషూష్మితాక్షులము కొట్టుటకేనియు జంకకుండు నా

పాపులలోన నేమియుని బైటికి రాఁగలవాఁడనయ్యెడన్. (53)

పదిమందితో మెలగుచును వారియభిప్రాయము గ్రహించలేని యీ ప్రాజ్ఞుఁడు తనకెట్టి సదభిప్రాయము గలదని వారికి చెప్పి యొప్పించ గలడు? ఇతఁడుపండితమ్మన్యుఁడనియు నీ క్రింది పద్యముల వలనఁదెలి యనగును.

తే॥ అచట మాయూరికరణము నమజుఁడైన,సీతయాహ్వయుఁ డొక్కంతనీతియుతుడు
కక్షయున్నను బండితపక్షపాతి కాననాకైనిస్నేహంబు గలిగియుండు. (58)

ఉ॥ భ్రాతవచించెనందుపయి బాగుగఁజర్చయొనర్చి తెల్పుచున్
సీతయనమ్రభావమునఁ జేతులుమోడ్చి వచించి నతంనే
యాతనిమాటనమ్మితివి యయ్యదిపోలునె? గ్రామదేవతల్
మాతలుగారెయెల్లరకు మాన్యలుగారొకొ బ్రాహ్మణాళికిన్ (63)

సర్వజనులు నా కార్యమునందు పాల్గొనినట్లు క్రింది పద్యము వలనఁ దెలియఁగలదు.

చం॥ సకలజనుల్ ప్రబద్ధులయిసాగిరి వీధులసంచరింపఁగన్
బ్రకటితమయ్యె గ్రామమున బాగుగ"నౌనుప్రతిష్ట"యంచు, సం
చకితమనస్కులైద్విజు లసమ్మతిఁజాటిరి నాల్గునెపులన్
వికటముగంబ్రసంగములు వేమఱుసల్పిరి కాఁపులెల్లెడన్. (82)

ఆయూరికరణములుగూడ నాయుత్సవములఁ బాల్గొనియుండ ద్విజుల సమ్మతిఁజాటిరిఅనియితడు చెప్పుటతానును. లౌకికవృత్తిం బ్రవేశించిన తనసహోదరుఁడునే ద్విజులని యితని యభిప్రాయము కాఁబోలు! ఈ కవిగారియొక్క యసూయాగ్రస్తమైన హృదయమును ఎందరెందరో ఆ గ్రామ ప్రజలే మందలించినట్లు యీ క్రింది పద్యమువలనఁ దెలియు చున్నది.

ఉ॥ నాకగపట్టవాఁ డిలను 'నాయముకాదని' యెంతచెప్పినన్
జేకొనకమ్మ దూష్టులను "శిల్పప్రతిష్ఠగయొనర్చ నర్హుఁడం"
చాకమసాలెనన్నిముని యాదృతినైనుళియింపఁబూని య

స్తోకవితండ వాదములతో నెదిరింపఁగఁబూని రయ్యెడన్. (93)

ఆ యూరి కరణములఁగూర్చి చెప్పు పద్యమునందలి వాక్యములు కాంచుఁడు

కం॥ రూఢిగ మా యూరి కరణాల్ . గాఢముగన్ మందలింపఁ గడఁగక యీ వ్యక్
శ్రౌతియుల వారి భూతి, మాన్యజనుల్ గలుగుటకు మెండుగాండ్రు గుణంబ్ (101)

వాద్యములతో ప్రతిష్ఠ కానున్న విగ్రహములూరేగింపఁబడుచుండఁగా నీ కవి యితని బంధువగు నొక పాటిసకీలుతో కలిసి భోజనము చేయుచు నతఁడు ప్రశ్న చేయఁగా.

ఉ॥ ఉన్న చరిత్రమంతయును నొయ్యనఁ జెప్పిన వార మైతి మే
మన్నుడువుల్ వినంబడినయంత నె యాతఁడు విస్మితాత్ముఁడై
"యెన్నడుఁ జూడ మిట్టిపని, యియ్యదియెంతయొ గొప్పతప్పు మీ
రన్న ననేగి చార్జియిడఁగా ర్యము సర్వము చక్కనయ్యెడున్" (109)

తరువాత యెట్టులో తాను గురిజాలలో మేజస్ట్రేటునొద్ద చార్జిపత్రము దాఖలు చేయుటకు పోవుట మొదలగునీపద్యములు చూడుఁడు.

కం॥ వ్రాయించి సరిగఁ జార్జి యాయన ద్వారమున వెళ్లి యయ్యాగి దాఖల్
చేయఁగ నెంచిన రానీఁడాయెను నధికారి యతని గ్రంథికమునకున్. (121)

సీ॥ ఏదియో యొక నెపంబిడి త్రోసివేయక తిన్నగాఁ జార్జిని తీసికొనఁడు
ప్రైవేటు ప్లీడర్లు పట్టుచు గాల్తులన్ స్థిరబుద్ధి దాఖలు చేసికొనఁడు
దండిప్లీడరు నేని దాలక్ష్య పెట్టక త్రాసు చేసిన సుడుల్ వ్రాసికొనఁడు
కోర్టున కరుదెంచు పార్టీల నెల్లరం, బువ్వఁదిట్టుగ నోరుమూసి కొనఁడు
ఇన్ని కళలుగలిగియున్న మేజస్ట్రేటు, పల్లెనాటి జనుల భాగ్యగరిమ
రాఁదటస్థమయి బీనవ్రతాన్నపరుగాక, యొక్క నాలుగేడులుండనయ్యె. (122)

మ॥ అతుఁడే యొక్కటి కోర్టులేని దినమై యంపందు నెళ్లించి యా
విపరీతాత్ముని దృష్టియందుఁ బడఁగన్ 'వీఁడాడు పోమ్మంచెదో.
నెపముం బెట్టి మరల్చ నొండవామునన్, సేనంత మర్నాఁడు పో
యిపడన్ ముందర నేఁడయో వెదకెఁగా యే మందు నా దోసమున్. (123)

క॥ వెదకి యెదియెదో చెప్పఁగ నదియది నే దిద్దికొనుచు నా చార్జినిన్
దుదకెట్లో పెట్టఁగలిగితి । వదలక తనికన్న మొండివాఁడ నగుటచే. (124)

చం॥ అయియయియన్నియుందుదకువ్యర్థమయయ్యెనుచార్జియేమనన్
స్వయముగనే విమర్శనము సల్పక యాతఁడుపిడ్గురేలకున్
రయముగఁజేసె దారిఫఁగు 'రమ్మటన్యాయము గల్గకున్ననే
న యిదివిమర్శచేతు'నని నాదగుకన్నుఁ నీళ్ళు తుడ్చుచున్ (126)

ఇందీతనిమూర్ఖత్వము. ప్రేలరితనము. అసూయధ్వనించుచునెయున్నవి. "పిడుగురాళ్ళ"నుండి అధికారివచ్చిన తర్వాతిసంగతియటకాంచుఁడు.

ఉ॥ కేసు విమర్శకుం గడఁగి క్రిందికి మీఁదికిఁ జేసి స్టేషనా
ఫీసరుగారు పోవుటయుఁ బెట్టితి నేను బిటీషనొండు "ఏ
ర్పాసిరి న్యాయమార్గమును గ్రమ్మఱ సొంతగ మీర్విమర్శకున్
దీసికొనుం"డటంచు బయిధీరునకున్ మదితత్తరంబునన్ (130)

ఇఁతడు చేయుపని న్యాయసమ్మతమైనచో నితనికి తత్తరపాటెందుకు?

తే॥ ఆపిటీషను జూచిధర్మాధికారి యప్పుడిది ఫైలులో "నింకదప్ప" దనుచు
ముందుగా న్యాయపక్షమేపూని కేసు చాలవరకు విచారించిచార్జిచేసె(131)

ముద్దాయి తా మొనరించిన పని న్యాయమెయనియు, వాదులుగూడ నందుపాల్గొనిరనియు చెప్పినట్లు యీ క్రిందిపద్యము

ఉ॥ ముద్దయిలందఱుం దమది మూర్ఖతసుంతయుఁ గాదటంచు మే
మద్దెసనుండికూడఁ దమయాపని కిష్టులమైతి మంచు నీ
విద్దె కలాదులున్ సలుపవేమఱు చూచుచునుంటిమంచుఁదా
మెద్దిరొయొచెప్పికొంచునపుడిందుకుఁదెచ్చిరికొంతసాక్ష్యమున్ 135

మేజస్ట్రేటు కేసు కొట్టివేసి యీ కవిని మందలించుట యీ క్రింది పద్యమున చూడనగు.

ఉ॥ "మీకరణాలెచేసిరినుమీ యిటు బ్రాహ్మణులయ్యుఁదామును, నే
నేకరణీన్ విధింతునిఁక నియ్యది నీకు హితంబుగాను, కై
కోకిది యాత్రలో, సివిలుకోర్టున కేగినఁ గల్గు న్యాయమం
చాకులపాటునన్ మరలనాదృతి చూపిరొ పంపెనాపయిన్ (146)

పై కేసు యొక్కతీర్పు నందలి 15-17 పేరాలం గాంచుఁడు

"(15) సివిల్‌కోర్టుయొక్క యధికారములోవుండు హక్కును స్థిరపర చుటయనునది యీ కోర్టువారివిధికాదు, కావున నాయంశములను విచారించఁదలఁపలేదు."

"(17) 4-5-6-7 సాక్షుల వల్ల విశ్వబ్రాహ్మణులే ప్రతిష్ఠలు చేయుట కర్హులనియుఁ జాలగ్రామములలోను, దాచేపల్లి, మాదినపాడుగ్రామ ములలోను జేయించిరనియుఁ దెలియుచున్నది. అందులో మాదిన పాడుగ్రామములోఁ గొలదికాలములో జరిగినట్లు దెలియుచున్నది.'' ఈతీర్మానముసైతము పక్షపాతముతో గూడినదియే యని యింకను నితఁడు వ్రాసెపుట యీ క్రిందిపద్యములఁ జూడనగును

కం॥ అనియేమొ వ్రాసి వెంటనె కనఁబఱచెందనదు తెలివి "కమసాలెలకీ
పనియందర్హతకల"దని ''యనియెవరోసాక్షు''లనుచు హాయెమందున్ (148)

తే॥ చాలచోట్లఁ బ్రతిష్ఠలన్ సలిపిరంట, కానిమాదినపాటిలోఁగరణమయ్యా
యొకఁడు తేలెను సాక్షియైయుర్విపైకి నదిశిలాక్షరమయ్యెధర్మాధిపతికి (149)

విశ్వబ్రాహ్మణులు చాలచోట్ల ప్రతిష్ఠలు సల్పిరని "మాదినపాటి"కర ణముగారిచ్చిన సాక్ష్యమును ఆమోదించు న్యాయాధికారినీ పండిత బ్రువు ఆక్షేపించినాఁడు. మూఁడవ సాక్షియగు వైశ్యమహాశయుని గురించి యితఁడు వ్రాసెయినయసందర్భపు పోకడలు కాంచుఁడు.

ఉ॥ మూఁడవ సాక్షి వర్తకుఁడు, మున్నిభు గ్రామణి పెద్దకాఁపునున్
గూడి"వచింపు సాక్ష్య"మని గ్రుడ్లుఱుమంగనె భీతినంది యీ
పాడు నుడుల్ వచించుటకుఁ బాల్పడె తాను. బ్రతిష్టయౌ నెడ
న్సోఁడట,యిష్టమేయఁట కనుండుతదుక్తులకేమియర్థమో (166)

ఉ॥ గడ్డియుఁ గంపయుందిని విగర్హ్యపు వృత్తిగణించి యర్థమున్
వడ్డికినిచ్చి బీదల దివాలుసపించును గాని యూరిలో
హెడ్డులబాకి మాత్ర,మురకే విడుచుందుద, పెక్కులేల పైఁ
బెడ్డలువేయు వారలకె పెట్టెడు నీతఁడు వంకదండముల్ (167)

మఱియు న్యాయాధికారి ధనాశ కలవాఁడనియు నీ క్రిందిపద్యమున చెప్పుచున్నాఁడు

ఉ॥ కారణ మేదో యుండవలెఁ గావున వ్రాసెను "వీరిసాక్ష్య మీ
ధోరణినున్న" దంచుఁ గడుదూఁకుడుమైనధికారి, నేరమే
తీరున బోవనో యదె తీరున బోయెను నిశ్చయాన, కే
ఘోరము చేయఁగా బడదు? కుత్సితమైనధనాశయున్న చోన్ (171)

ఈ పిచ్చిధోరణి యింకా యెట్లున్నదో కాంచుఁడు

ఆ॥ 'మాకులెక్క జూచి మైలేజి లిం" డంచు, నస్మదీయసాక్షులందఱుపుడు
పోయి యడిగిరతనిఁ బోలీసుకేసౌట, నదరఁగొట్టి పంపెనతఁడు వారి. (175)

తానంతేని కడగండ్లుపడి అది పోలీసుకేసగునటుల చేసియు, కేసు నిలుపుకొనలేకపోయెను. పైగా తనసాక్షులకు మైలేజీ (సర్కారుసొమ్మును) అడుగబోగా 'నదరఁగొట్టి పంపెనతఁడు వారి' నని మేజస్ట్రీటుపై యేమో నిందమోపగలిగినట్లు తనమూర్ఖతచే భావించుచున్నాఁడు. పైయధికారికి తెల్పుకొని యెట్లో వసూలు చేసికొనియు, ధర్మాధికారికింకను అపవాదములు పెట్టు యితనిపన్ను గడగాంచుఁడు.

తే॥ కోర్టులో ధర్మశాస్త్రముల్ కొన్ని నాఖ దాఖలైయుండ నిప్పింపఁదలపడయ్యె
తిరిగితిరిగియు వేసారితిండదక్క మింతకన్నను దౌర్మార్గ్యమేమికలదు (174)

కేసుకొట్టుబడినపిదప తనతలవాలినదని తెలుపుటకే క్రిందిపద్యముచాలియున్నది

ఉ॥ ఆవిధిఁ గేసు కొట్టపడి యామహనీయునిబారినుండి నే
నేవిధిగానొ తప్పుకొని యింటికిఁ జేరుదు నూరిలోని మా
యావిదులాచరించు పరియాచక మెక్కుడుమై మదానన
బీవలవెళ్ళబెట్టుటకు ప్రేరజనియించె నికేమి చేయుదున్. (176)

కావలెనని కేసుచేసిమరల ఆమహనీయుని బారినుండి యెట్లో తప్పుకున్నాడఁట. అప్పుడే తనయూరిసమీప "పిడుగురాళ్ళ"కీశాన్యదిశ నని మిది మైళ్ళదూరంబున జరిగిన వ్యవహారమునుం గూడ నెజేంగించుచున్నాఁడు చూడుడు

చ॥ బలవదపాయ హేతువగు పాపయుపాలెపు వార్త యేమనన్
గలవొక దేవళం బదియెుకానొక బ్రహ్మఁడు ద్రవ్యమిచ్చితాఁ

ద్రోలుత సృజింపఁజేసెనఁట, ధూర్వహులచ్చటభూమిదేవులున్
గలవు, తదర్చకుండుగ నొకానొకనంబివిధింపఁగాఁబడెన్. (181)

గుంటూరునుండి మాచర్లరైలులో "బెల్లంకొండ" స్టేషనుదిగి అటకు ఈశాన్యమూలగా నెనిమిదిమైళ్ళలో నీ "పాపాయపాలెము"ను గనవచ్చును. అందు ప్రస్తుతమున్న 'వేణుగోపాలస్వామి దేవాలయము నకున్నూ మఱియొక శివాలయమునకున్నూ మధ్య నీరెంటికిన్నీ మించిన స్థితిలో "సీతారామస్వామిఆలయం"బను పేరిట నీగుడి వెలయుచున్నది. దీనినే కీ॥ శే॥ బంగారురామస్వామియను విశ్వబ్రాహ్మణుఁడు స్వంతముగా కట్టించి అర్చన నిమిత్తమై 16 యకరముల భూస్థితినిన్నీ వస్తు వాహనములనున్నూ ఒకవైఖానస బ్రాహ్మణున కిచ్చి వానిచే అన్నింటికి జవాబుదారిగ ఎగ్రిమెంటును సయితము వ్రాయించుకొని యుండెను. ఈయనకు వేంకటప్పాచార్యులు అను ఏకైక పుత్రుఁడు గల్గి తండ్రియనంతరంబా దేవాలయకర్తయూ, ధర్మకర్తయూనై ప్రశస్తముగ పరిపాలించుచుండెను. వీరికిపంచపాండవులనొప్పు 1రామబ్రహ్మాచార్యులు 2 తిరుపతయాచార్యులు 3 దేశికాచార్యులు 4నరసింహాచార్యులు 5 అనంతాచార్యులు అనునైదుగురుపుత్త్రులును సుగుణఖనియగు నన్నపూర్ణమ్మయను నొకపుత్రికయుగలిగి సిరిసంపదలచేదులదూగఁజొచ్చిరి. అప్పుడాయూరపాఱులొకింతవీరిపైనీసువహించి,వంచించుటకుపక్రమించిపొందినఫలితములీ కవి తెలిపెడిరీతిగమనార్హము.

కం॥ గుడికట్టించినయాతని కొడుకునకున్ భూమిసురులకుం బడ కొక్క-
ప్పుడు స్వామికి నైవేద్యముపడిపోయెడి వంతస్థితియె పట్టెనఁ టచటన్. (182)

చ॥ భయపడకక్క-లాదుఁ దటుపైని రమేశుగుడింబ్రవిష్టుఁడై
స్వయము నివేదనాదికమునల్పుడు నందొకధర్మకర్త తా
న్రయమున నేగి చార్జియిడ "నాదితవాలయ"మంచుఁ జెప్పుచున్
జయమునుగాంచె వర్ధిప్రసన్నుఁడుకానధికారి యొట్టులో (183)

ధర్మకర్త వేంకటప్పాచార్యులుగారని తెలియుచుండ నిరర్థకమైనచార్జి

నిడి విఫలుడైన వేరొకపెటివానిని "అందొాకధర్మకర్త" యనిలిఖించుట ఇతనికెట్టిపని? వైఖానస బ్రాహ్మణుండైన నంబి నైవేద్యాదులనునిలిపి, వస్తువాహనములనువదలి వైదొలగినయనంతరం బాదేవాలయార్చనకై విశ్వబ్రాహ్మణుండగుమఱియొకయర్చకుని నియమించెనుగాని స్వయముగా నివేదనమునసలుపలేదు. ఇందుంగురించియటగల్గియున్న శిలాఫలకమందలి శాసనాంశమునిటనుదాహరించుచున్నాను.

"సనాతనగోత్రుఁడురంగుముత్త్యయ్యకుమారుఁడురత్నయ్యకు...క్రోధి నామసం॥ర జేష్ఠశుద్ధ౭(21-7-1904)సీతారామస్వామివారికినిత్యనైవేద్య దీపారాధనలుచెయ్యడమునకుయేర్పాటుచేసి స్వామికివున్నభూమిస్వాధీనముచేయడమైనది...,, (శిలాశాసనము)

ఇట్లాచంద్రతారార్కస్థాయిగశాసించి స్వామికి నిత్యనివేదనాదికములనుజరిపించుచుండినను వైరవర్గమువారుసహనమూనినట్లులేదు. ఇంకనూ

ఆ॥ అంతవారిమీద నాయూరిబ్రాహ్మణుల్, దండిపైరమూని యుండనయ్యె
దిటముచెడకయతఁడు దేవతాకార్యంబు, లను క్రమముగ జరుపుకొనుచునుండె [184]

క॥ అంతటబోనీయక ద్విజు లంతః క్రోధములతోడ నరిగి తవోకః
ప్రాంతంబునఁ కచటి గరుత్మంతుని వాహానముదెచ్చి తమగుడిలోనన్. [188]

ఉ॥ పెట్టిస్వకీదార్ఘ్యమున భీతిలజేయ గలాదవర్యు నా
దట్టుడుపోయి చార్జియిడె ధర్మసభాపతియద్ది 'చౌర్య'మన్
పట్టుదలం గరంబు చలపట్టి విధించెను శిక్ష వారికిన్
రట్టడి కార్యముల్ సలుపరాదెవరైననునేమియూవిధిన్. (189)

ముద్దయిలయిన 1 అశ్వత్థనారాయణ, 2కాశీరాజు లక్ష్మీనారాయణ, 3 కా॥కోదండరామయ్య, 4కా॥వెంకటేశ్వర్లు, 5కా॥దాసయ్య, 6కోటాటెనీలకంఠము(శివార్చకుఁడు)అనువారు సీతారామస్వామి ఆలయములోని హనుమద్వాహనమును తస్కరించి "తమగుడి"అనువేణుగోపాలస్వామిఆలయములోపెట్టి తాళమువేసి పలాయనమైరి. అప్పుడు వెంకటప్పాచార్యులు తగుసాక్ష్యముపెట్టి రిపోర్టునివ్వగా విచారణపైఆ

వాహనము తమదేననియు "గరుత్మంతునివాహనం"బనియువాదించిరి. గాని సీతారామస్వామికి 'బొందలఅలివేలుచేయించిన హనుమద్వాహనంబనియు, పూర్వార్చకుఁడైన 'నంబి' ధర్మకర్తకువ్రాసియిచ్చియున్న ఎగ్రిమెంటులోనుదహరించిన హనుమద్వాహనంబేయదియగుటంబట్టియు, నింకనూ బలమైనసాక్ష్యంబుండుటంబట్టియు నేరముస్థిరపడగా కారాగారశిక్షకునర్హులైరి. ఈ దైవభక్తాపచార నేరమునకు నాధ్యాత్మికముగ కూడనెంతటిశిక్షకైన నర్హులేయగుదురు. కుటుంబక్షయులైయున్న వీరా చెరసాలయందుఁ గుందుచూ అపీలునందు నిర్దోషులుగ ప్రకాశించిరఁట! చూడుఁడు.

ఆ॥ వడి నపీలుచేసి వారుతర్వాతను, విగతదోషులగుచు విలసిలినను
కర్మవశత ముందు కారాగృహమునందు, గుందవలసివచ్చెఁగొన్ని నాళ్ళు. (190)

ఇందునూ వితండితరుల ఉన్నతింగూల్చద్రోయుటకే యత్నించి యుండెను. తుద కేర్పడిన అపజయమునకు గినిసియు మఱల "అవినయ సంభాషణంబు లధికంబయ్యె"ననియు "బెక్కంద్రేపడగింపగవలె నీపాపిష్టుల కనుచునేము పరిపరిగతులం" బ్రోత్సహించెననియు తన తొల్లింటి 'చెడువ్యాజ్యము'ను రేకెత్తించి నరసరావుపేటలోని పులిపాక పూర్ణయ్య, తాడేపల్లి ఆంజనేయశాస్త్రియను ప్లీడరులచే ప్లయింటును వ్రాయించి-మఱియొకప్లీడరుకుంజూపి కోర్టులో దాఖలుచేసి గజెటునం బ్రచురించువల్ల ధనాభావంబేర్పడినటుగా చేసినకృషీ అందుపై గల్గిన చర్య నెఱింగించుట గాంచనగును.

తే॥ వచ్చిక్రమ్మర వృథగ నిర్వాది యొకండు, రొప్యముల్ వెట్టి గజెటునం బ్రచురపఱుప
శక్తిచాలకయుంటచే జానపాటి బ్రాహ్మణులయభిడవేటుల బడయనెంచి (207)

క॥ ఒకొక్కకరిక్రమోల కరిగిన, బెక్కంద్రట దస్కతులను బెట్టిరి కానీ
వెక్కసముగ నొకరిద్దరు, చిక్కులుకడు బెట్టిరకట చేయక వ్రాళ్ళన్. (208)

ఆ॥ అట్టులభిడవెట్లనెట్లెట్లో యార్జించి, సివిలుఁకోర్టునందు జేర్చ నచట
'దస్కతులు నిజముగఁ దత్తదాఖ్యాతుల, వంచు నెట్లు నమ్మనా"నటంచు. (211)

క॥ వడవేసి యుంచి తుదకీ, "చెడిదపువ్యాజ్యంబునందు చెక్కులుగా కొ
క్కుఁడుకూ డనర్హుఁడగునని, వడి మున్సిఫు గారు త్రోసివైచె బిటీషన్. (212)

తరువాత నొక్కవత్సరకాలమున నెట్లో ఫైనలుకు తేఁగలిగినట్లె క్రింది పద్యము

చం॥ ఇటులొకవత్సరంబువఱ కీయక పర్మిష నుంచియుంచి య
వ్వటికి "విమర్శచేతు" నని పైలునఁ దద్వ్యవహర్తవేసెఁ దా
నెటులనొ, అంతకున్ మునుపె యే యనృతంబులొనింపి పూర్తిగా
నటఁ బ్రతివాదులందఱును నాన్సరుదాఖలుచేసిరుద్ధతిన్. (213)

ప్రతివాదులు సంవత్సరకాలములో సత్యము సమకూర్చలేక అనృతంబుల నింపిరనుటలో అర్థమేమైన నున్నదా! చూచుఁడు. వారిఆన్సరునందు కొన్ని పేరాల నీక్రింద నుదహరించుచున్నాను.

సివిల్ ప్రా॥కో॥ 110 శే॥ ప్రకారం ప్రతివాదులు దాఖలుచేసిన స్టేటుమెంటు.

(1.) దావాంశములోఁ గొన్నికల్పితములు—దావా శాస్త్రప్రకారము నిలువఁజాలదు.

(2.) జానపాటిగ్రామములోని వారలందఱికి నీ దావాతో సామాన్యసంబంధజోక్యములు (Same interest) లేవు. అట్టిచోవారందఱినిమిత్తము వాదియొక్కండే దావాతెచ్చుటకర్హుఁడుకాఁడు.

(3.) పోలేరమ్మ, పాతపాటమ్మలు బ్రాహ్మణార్చ్యములుకావు. ఆదేవతలకు నిత్య నైవేద్యదీపారాధనములులేవు. కొలుపులయందు వానిని ప్రజలు యథావిధిగా సేవించుచున్నారు.

(4.) విగ్రహప్రతిష్ఠగాని తక్కిన యాజనాదికర్మలుగాని చేయుటకుఁ బ్రతివాదులకు సంపూర్ణమయిన హక్కుకలదు. ఇందుఁగూర్చి ప్లయింటు 5వ పేరాలో వాది వ్రాసుచ్చిననీచవచనముల నిందు ఖండించుట యప్రస్తుతము గావున విస్తరించలేదు.

(5.) దేవాలయములయందుఁ దిరిగి ప్రతిష్ఠల జరుప నవసరములేదు. అవసరమున్నట్లు కోర్టువారభిప్రాయపడినను నందుకు రు 190లు ఖర్చు కాదు.

(6.) వాదికిఁగాని తక్కిన పాటీలకుఁగాని లేశమయినను నష్టముకలు లేదు. వాదికోరిన యింజక్షన్‌గాని యేయితర పరిహారముగాని వాది పొందఁదగఁడు."

ఈ కేసు కాలవ్యవధినిగూర్చి చెప్పుట చూడఁదగినది.

తే॥ నరసరావ్ పేట కోర్టులో నాదు కేసు నడివిచారణ చేయఁగఁ బడకమూఁడు
వత్సరంబులవఱకు ననివార్యమైన యంతరాయపరంపరనట్లయుండె (స్వ.ద్వి 1)

క॥ కదుఁబెరిఁగి ఫైలిదంవిధి నడినడిగ విమర్శగాక వర్తిలదావా
లడిషనలు కోర్టునా సేర్పడియెఁ గుంటూరఁ బ్రజలభాగ్యపుఁగరిమన్ (ద్వి8)

ఆ॥ అటకుఁ బ్రాన్స్ఫరగుడు నా కేస్ విమర్శకుఁ దీసికొనిరి కొన్ని దివసములకు... (ద్వి8)

తనపక్షమున సాక్ష్యముచెప్పవచ్చినవారి భోజనవసతింగూర్చి వ్రాయబడిన యంశముగమనార్హము.

శా॥ మత్పక్షమ్మున సాక్ష్యమున్నుడువ ధీమచ్ఛ్రేష్ఠులై పెక్కురున్
దత్పట్నంబున కేగుదెంచి నిలువన్ దద్భోజనాద్యర్హవి
త్తోత్పత్తింగనజాల కేను మదినెంతో చింతనొందంగ నే
తత్ప్రాజ్యండొకదారి చేసిచనియెన్ దారిద్ర్యవిచ్ఛిత్తిగన్ (ద్వి13)

మఱియు రంగావఝ్ఝులహనుమయ్య యనుప్లీడరుధనముతీసుకొనకయే పనిచేయుచు అన్నపానాదులిచ్చుచుండి నట్లతనింగూర్చి

క॥ ప్రతివాదుల ప్లీడరులటు ప్రతిదినమున్ గొని ధనంబు పని సేయంగన్
మతిమంతుఁడైన హనుమయ యతనిగృహంబున నిమాకు నన్నంబిడెడిన్ (ద్వి26)

పాఱుండయ్యా-నిజమే చెప్పువాఁడనిజడిసియు శిష్టా సీతారామశాస్త్రి యనువండితునకు తనప్లీడరుకోరికపైన సమనుజారీచేయించుటయు నతఁడుకోర్టుకుఁదయ సేయంగా తానేమియు చెప్పుకొనంబోవుటయుమున్నగు విషయములీక్రిందిపద్యములందు గనంబఱచి యున్నాఁడు. చూ॥

ఉ॥ ఈ యొకదానికిం జడిసియే మునుసాక్ష్యముగోరకున్న నే
నాయితరంబులన్ భ్రమసి యజ్వ "దృఢంబుగ రావలెంజుమీ
యీయన సాక్షిగా మనకు"నంచు వచింపఁగ నందు మీఁదటన్
జేయఁగఁజేసితిన్ సమను, చేరఁగవచ్చెను గోర్టుకాతఁడున్. (ద్వి.39)

కోర్టుకు హాజరయిన తన యీ సాక్షి యొక్క "హృద్గతంబారయ" దలంపడగా నాతండితర ధోరణి ననుసరింపకుండె నఁట. (స్వా. ద్వి. ఉ॥ 40 పుట)

మఱునాఁడు సిరస్థాదారు నింటికేగి అటకును దయచేసియున్న యీ సాక్షికి దగ్గరగ జేరి నయభయంబులు ముప్పిరిగొనం దానేమియో మరల చెప్పికొనం బోవగా ప్రతివాదులగు త్వష్టృవంశజుల గోత్రములు కొన్ని తెల్పుమని తన నతండడిగెను. అందు కితండేమియు చెప్పినట్లు లేదు. సరికదా "సరియగు సాక్ష్యమునే" నుడువం గలఁడని సంబరపడినట్లుకూడ తెలియుచున్నది. చూడుడు.

కం॥ ప్రాతఃకృత్యములెల్లను । నా తర్వాతన్ రయంబ యరిగితి నేత
త్ఖ్యాతుని యింటికి, శిష్టా । సీతారామార్యుఁడు దయచేసెను నపుడే॥ (62)

కం॥ దయచేసి కూరుచుండుచు । నయభయముల నొద్దఁ జేరునన్ గని "త్వష్ట్రి
న్వయజాలగోత్రములు కొన్ని యెఱింగింపంగ వలయునీ" వనియనుచున్॥ (63)

చ॥ సరియగుసాక్ష్యమున్ నుడువుచాడ్పున నేమియొ మాటలాడ సం
బరపడి నేనుబోయితిని. భక్షణచేసి తదార్యుఁడంతఁ జె
చ్చెరఁ బదిగంటలౌసరికిఁ జేరి కచేరధికారి రాకకై
త్వరపడుచుం దదాగమన తత్పరుఁడై వసియించె వాకిటన్॥ (64)

ఇంక నాకోర్టు వ్యవహారమునుంగూర్చి గాంచుడు.

క॥ ఏతెంచెను మున్సిఫ్ గార్ । తేతెమ్మని మారికార్డె తెప్పించె వెసన్
సీతారామబుధా! యని। స్ఫీతరవంబున జవాను పిలిచెన్ మున్మార్॥ (65)

క॥ చెచ్చెర సాక్ష్యస్థానము । చొచ్చి తదార్యుండు స్వేచ్ఛచొప్పునఁ బలికెన్
వచ్చి వకీల్ ప్రశ్నించిన । హెచ్చెన్ ధోరణి మఱింత యేమని చెపుదున్ (66)

ఈ తన సాక్షి "పండితుం"డనియు "సరియగు సాక్ష్యమున్" నుడువు నని శ్లాఘించియు మరల స్వవచన వ్యాఘాతముగా నీతని వాఙ్మూలము నంతను 77వ పద్యములవరకు వికట విమర్శనం బొనర్చెను. చూడుండందొకండు.

కు॥ మాదిగలుం దత్సదృశులు వాదించుచునుండి రింతవఱకిద్దానిఁ
భూదివిజులయ్యునీతఁడుతా పెగె నివ్వాదమునకు, ధన్యుఁడుగాఁడే (77
ఉదాహరణంబున కీసాక్షి వాఙ్మూలము నందలి కొన్ని అంశముల నిట
నుదాహరించుచున్నాను చూడుడు.

"వేదములో విశ్వబ్రాహ్మణులు అనే పదము(నియోగబ్రాహ్మణులు, వైదికబ్రాహ్మణులు అనుపదమువలె)యెక్కడలేదు"(స్ర. 122 పుట) "Cross క్షత్రియ రుషులు క్షత్రియ గోత్రములకును వైశ్య రుషులు వైశ్యులకు మూలపురుషులుగా వున్నారు. బ్రహ్మరుషులు బ్రాహ్మణులకు మూలపురుషులుగా వున్నారు. విశ్వామిత్రరుషి గోత్రము క్షత్రియులలోను బ్రాహ్మణులలోను వున్నది. లోకకర్త అయిన ఆది నారాయణమూర్తికి హిరణ్యగర్భుడైన చతుర్ముఖబ్రహ్మ పుట్టినాడు. ఆయన ముఖమునుంచి బ్రాహ్మణులు క్షత్రియులు భుజమునుంచి వైశ్యులుతొడలనుంచి శూద్రులుపాదములనుంచి పుట్టినారు. అప్పుడు ముఖమునుంచి పుట్టిన బ్రాహ్మణులందరు రుషులయినారు..."

"బ్రహ్మకు 5 ముఖములు వుంటే ఒక ముఖమును సాంబమూర్తి తెగగొట్టినాడు. విశ్వకర్మ అని విరాట్టుకు పేరువున్నది. త్వష్ట నవ బ్రహ్మలలో ఒకడైన విశ్వకర్మ కుమారుడు. త్వష్ట అనగా చెక్కేవాడని అర్థము. శిల్పాదులమనే వారందరు విశ్వకర్మ సంతతివారు."

"సానగ, సనాతన, అహభూన, ప్రత్న, సుపర్ణ, యీ 5 గురు వేదములో చెప్పబడిన ఋషులే."

"విశ్వామిత్ర, జమదగ్ని, భారద్వాజ, గౌతమ, అత్రి, వశిష్ట, కశ్యప, అగస్త్య. యీ 8 మంది వీరి సంతతివారు మా బ్రాహ్మణ ప్రవరలో వస్తారు." "నాదితైత్తిరీయశాఖ" (123-124 పుటలు)

"వజ్రసూచికో పనిషత్తులో ఆత్మనుబట్టి బ్రాహ్మణుడా దేహాము నుబట్టి బ్రాహ్మణుడా అని ప్రశ్న వచ్చినది. అప్పుడు అది తత్వ సంబంధమైన ప్రశ్న కాదని కొట్టివేసినారు. జాతి లోకసంబంధమని చెప్ప

బడివున్నది. యీ భరతఖండము మట్టుకే యీ జాతిభేదము.యెం దుకు చెప్పినారో చెప్పవీలులేదు." (125)

"త్వష్టఅని బ్రహ్మకు పేరువున్నది" "గ్రామ పౌరోహిత్యముచేసే వారు బ్రాహ్మణులలో చివరవారని మనుస్మృతిలో చెప్పబడివున్నది గాని వారు బ్రాహ్మణులే. వాది వైదికబ్రాహ్మణుడు. నేను వైదిక బ్రాహ్మణుడనే. నేను వానిని యెరుగను. అతని వృత్తియేమో నాకు తెలియదు" (126పుట)

"వశిష్టుని భార్య అరుంధతి చండాల స్త్రీ. అరుంధతి కుమారుడు శక్తి-శక్తి కుమారుడు పరాశరుడు శక్తి భార్యపేరు శ్వపాకి-అనగా కుక్క-మాంసము తినేది అని అర్థము. శ్వపాకిజాతి సంకీర్ణజాతులలో అధమాధమము. పరాశరుడి కుమారుడు వ్యాసుడు-తపస్సే ముఖ్యమని చెప్పుటకుగాను వ్యాసులవారు తన కులసంగతి చెప్పినాడు." (127-128పుటలు)

"విశ్వబ్రాహ్మణులకు వైదికబ్రాహ్మణులకు పంక్తిభోజనము లేదు. వైదికులు నియోగులు పెడితే తినరు." "విశ్వబ్రాహ్మణుల అన్నము రుంజలువాయించేవాండ్లు తింటారు" "విశ్వబ్రాహ్మణులని పిలువబడే వారు అనాదినుండి మా బ్రాహ్మణుల యిండ్లలో భోజనము చేయుటలేదు. (స్వ 129 పుట.)

అరుంధతినిగూర్చి యీ శిష్టా సీతారామశాస్త్రిగారు చెప్పినట్లే యితరు లెవ్వరైన చెప్పగలగరనియు అట్టివారు 'ముండకొడుకు' లని మొఱుగుట యీ క్రిందిపద్యమునం గననగును.

క॥ చండాలి అరుంధతి యని ముండకొడుకు లెవ్వరేని మొఱుగుదు(
తా నుద్దండుండని చెప్పందగు పండితుడై యిట్లుచెప్పఁ బాల్పడె నకటా. (75)

న్యాయమూర్తిని తెగడుతెలుంగితని కవిత్వమునందు గనగగును.

సీ॥ చేసినాడుపకృతి చేతసైనంతలో, బ్రాహ్మణుల్ గాజూచు బత్తులకును
వేసినాఁడొకమాట వెలమాట మున్నిభు, జాతులు నాలుగున్ సమములనుచు

కోసినాఁడెన్నియేని గొప్పవౌ సొరకాయ 'లా యశాస్త్రముల్వచ్చు'ననుచు దనకు
పోసినాఁడు విషంబు పోయంగ దగినంత, ఖలధిక్కృత ద్విజకాండమునకు

గీ॥ సంస్తుతించెను గమపాల జనము తనను, సంతసించెను మున్సీఫు చాల మదిని
విశ్రుతంబయ్యె వట్టిశాస్త్రిత్వమతని, ఏమి బ్రాహ్మ్యంబుతోఁబని యీయనఁకిక

శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారిని తనపక్షమున సాక్ష్యము చెప్పుమని మిక్కిలి ప్రార్థించినట్లును నతఁడువచ్చి కోర్టులో యిచ్చిన వాఙ్మూలమును మెచ్చుకొనుచు తరువాతదెగడుటచే కొప్పరపు కవుల పక్షపువారే మిక్కిలిఖండించి దూరినట్లును యీక్రిందిపద్యము తెలుపుఁగల్గియున్నది.

ఉ॥ సాక్షిగవచ్చి తానుడివె శాస్త్రపథంబును దొల్గకుండ మ
త్పక్షమునందు, దానిని నపహ్నుతిసేసి యథేచ్ఛఁ గొప్రపుం
బక్షపువారు వ్రాసిరి యవాచ్యపు వ్రాఁతలు కొంతమంది రూ
క్షేక్షణులౌచు వారిపయి నిందున నాకభిమాన మంచహో. (83)

ఉచితానుచితజ్ఞతలేక తన ప్రతివాదులనేగాక కొంత నిజము వచించిన శిష్టా సీతారామశాస్త్రివంటి పండితులనుగూడ నోటికి వచ్చినట్లు ప్రేలుచు ఆత్మస్తుతి పరనిందలతో నింపుచున్న తన "అభినవ సరస్వతి" పత్రికను అనేకమంది అసహ్యించుకొని త్రిప్పివేయుచు వ్రాసియున్న లేఖలయందలి ఒక్కముఖ్యాంశంబిటనుదాహృతము.

"ఇప్పటిసందర్భములనుబట్టి నేను మీ"అభినవ సరస్వతి''కి చందాదారుడగానైన నుండుట కిష్టపడను. కావున సంగతి తెలియపరచుచున్నాను. ఇంతే నమస్కారములు చిత్తగించవలెను.

వి పులిపాక పూర్ణయ్య వ్రాలు' (స్వా. 138 పుట)

ఈతని తప్పిదములను నిరూపించుచు తిట్టువారున్నట్లు బాల్యమిత్రులు సైతము యీసడించినట్లును తెలుపుకొనుట గాంచుఁడు.

ఉ॥ నైల్యముమోపి యీ విధిని నట్టెజెడఁదిట్టెడి వారిబోధలట్
బాల్యమునుండి మిత్రులయి భాసిలుచుండినవారు సైతము

స్వాల్ప్యముఁజూపి నేఁ బ్రచురణంబొనరించెడి పేవ"గొల్ల"మఱి
కల్యానుకూల లేఖలనెకాయకుఁ బంపిరిఁ కేమిసేయుదుర్. (91)

ఎందరెట్లితనికి బుద్ధిగఱపిన నేమిప్రయోజనము? 'వెనుకటిగుణమేల మాను" అన్నట్లు తనసాక్ష్యమునందునూ తొల్లింటి పండిత సాక్ష్య వాఙ్మూలములనె గట్టిగా ఖండించితి ననుచున్నాఁడు.

కం॥ తదనంతరసాక్షిగనై యెవ్వరోనచియించినాఁడనేఁగూడనటర్
ఒదవెడిసీతారామా.భిధ బుధుఁడిఖండనంబు పెల్లుగదానర్ (98)

ఏదేదో,వాకొనంగల్గినవాఁడేనా బుధునుడిని ఖండనంబు సేయఁగల వాఁడా? తనతరపు "తెలగ" "చాకలి" 'యానాది' "మంగలి" "భోగము" 'మాల' మొదలగు 16 మంది నాశ్రయించి సాక్ష్యము చెప్పించుకొనియు న్యాయాధికారి ఒక నెల వాయిదా వేయుటచే సంఘటిలినట్లు ప్రతివాదులయొక్క సాక్షులనుగూర్చి యాక్షేపించుట నీ కింది పద్య నందుగల్గియున్నది. చూ॥

ఆ॥ మంచివౌ దినాలు మాసఁబు వాయిదా న్యాయకర్తచేత నీయబడఁగ
కమ్మ రెడ్డి వెలమ కమసాల మాలలర్ సంఘటించుకొనిరి సాక్ష్యమునకు.
(స్వ. తృతీయభాగము 6.)

క్రమముగా వాయిదా సమయమునకు హాజరయిన ప్రతివాదులందలి మూడవవానింగూర్చి చెప్పుచున్న విధంబుగనుండు.

తే॥ వచ్చెఁ గ్రమముగ వాయిదా, చొచ్చిరపుడు ధర్మసభ వారలందర ధర్మమూని
ఆది మూడవ ప్రతివాదియైన నంది,గామ కాశీపతికి బోనుధామమయ్యె. (7)

న్యాయస్థానములోసాక్షులు నిలచియుండి చెప్పవలసిన బోను నిజము చెప్పఁగలవారలకు ధామముగనె యుండవచ్చును. తమబోటి అసత్య వాదుల కది యెటుల భయంకరముగ నుండునో యాయనుభవనీ యుఁడు చెప్పిన బాగుండెడిది. మఱియు నా ప్రతివాది (1 వ సాక్షి) యొక్క సాక్ష్యమునుంగూర్చి చెప్పిన యంశమును గాంచుఁడు.

కం॥ అందఱు ప్రతివాదులలో,ముందరచెప్పుకొనదగిన మొనగాఁడీతం,

డందునఁగాకె వకీల్గారు, లంచజ్జను సంగ్రహించె లలిసాక్ష్యముకేక, ఈ ప్రథమ సాక్షియొక్క వాఙ్మూలము నందలి ముఖ్యాంశములం గొన్నిట నుదాహరింతును చూడుడు.

"నాపేరు నందిగామ కాశీపతి (2వ ప్రతివాది.) నేను బ్రాహ్మణుఁడను. మాకు యాజనాధికారమున్నది. మా కులములో యాజ్ఞికము చేయింపగల వారున్నారు" (150 పుట)

"మాకు షోడశకర్మ లున్నవి. వాది వైదికుఁడు. వైదికులవృత్తి బిచ్చమెత్తుట.' ఇతరకులము వారు కొందఱు మా యిండ్లలో భోజనముచేతురు. మా గ్రామములోఁ బాతపాటమ్మ, పోలేరమ్మ యను గ్రామదేవత లున్నవి. మా కులమువారె యీ దేవతలకుఁ (మొట్టమొదట) బ్రతిష్ఠ చేసినట్లు చెప్పుదురు. పోలేరమ్మను గ్రామములో గ్రొత్తగాఁ బ్రతిష్ఠచేసినారు. నందిగామ తాలూకా (కృష్ణా జిల్లా)వోలేటి లక్ష్మయ్యయను నతఁడు బ్రతిష్ఠచేసినాఁడు"(150పుట)

"గ్రామదేవతలకు బ్రాహ్మణులు బోనములు చెల్లింపరు. వైదికులుకూడ బోనము చెల్లించుటకై వెళ్ళరు. గ్రామదేవతల యుత్సవములకు శూద్రులయొద్దనుంచి చందాలు వసూలుచేతురు. అర్చకులు కుమ్మరులు, గొల్లలు. 1వ ప్రతివాది ప్రతిష్ఠచేసిన తర్వాత గ్రామములో శూద్రులందఱు దేవతలకు బోనములు చెల్లించుచున్నారు. వాది యెన్నఁడు బోనము చెల్లింపలేదు" (151 పుట)

గ్రాసు- పూజచేయుటకు నేనా దేవతల యాలయముకుఁబోను వైదికులు బ్రాహ్మణులు కారు" (స్వ. 151 పుట)

"నియోగులు బ్రాహ్మణు లగుదురో కాదో నాకుఁ దెలియదు. మా కరణము రంగయ్య బ్రాహ్మణుఁడగునో కాదో నాకు తెలియదు.' (151 పుట)

శూద్రులు మా యిండ్లలో భోజనము చేతురు. "శూద్రులలోఁ

వెగ భేదము నేను జెప్పలేను. వెన్నా కృష్టయ్యయను రెడ్డి మా యింటిలో భోజనముచేయును. అతఁడు నా సాక్షి కాడు."

"నేను స్థితిగలవాడను గాకపోవుటచే శూద్రులకంటెఁ దక్కువ జాతివారి కెన్నడును నన్నము పెట్టలేదు. పందిటివారి పాలెములోఁ గొందఱు కుమ్మరులును, జాకలులునూ మా జాతివారి యిండ్లలో భోజనముచేయఁగాఁ జూచినాను. వారిపేరులు చెప్పలేను. 2,3 సంవత్సరములక్రిందట మా బావమరిది యింటిలో వివాహములోఁ జూచినాను. మా వృత్తి శిల్పము. మేము విగ్రహములనుజేతుము. మేము ముహూర్తములుబెట్టి యిండ్లు కట్టుదుము. బంగారపుపని చేతుము. చదువుకున్నవారు పౌరోహిత్యము చేతురు." (స్వ. తృ. 152 పుట,)

"నేనువ్రాసిన దస్తావేజులో విశ్వబ్రాహ్మణుఁడ నని వ్రాసినాను. మా కులము వారందఱు ప్రతిష్ఠలు చేయుచున్నారు కాఁబట్టి ప్రతిష్ఠాధికారము మాకే కలదని చెప్పుచున్నాను.'

"మా గ్రామదేవత మొదట నెవరు ప్రతిష్ఠించిరో నా కెవరుఁ జెప్పలేదు. అనఁగా బేళ్లు చెప్పలేదని యర్థము. మేము చేసియున్న ప్రతిష్ఠకు ముందు వైదికుల వల్ల బ్రతిష్ఠ జరిగినది."

"నాది సుపర్ణసగోత్రము-మా గోత్రములు ఋషులద్వారావచ్చినవే. మా పూర్వికులు విశ్వావసు, తార్క్ష్య, సుపర్ణసులను ఋషుల వలన వచ్చినారు.' (153 పుట)

"నా ఉపనయన మప్పుడు నరసింగు చంద్రశేఖరయ్య యను మా కులపు బ్రాహ్మణుఁడు యాజ్ఞికము చేయించినాఁడు. (154పుట) రీక్రాసు-నేను శైవుఁడను. శైవు లందఱు చనిపోయిన వారిని పాతివేతురు. నందిగామ కాశీపతివ్రాలు' (అనివున్నది.)(152-153. 154పు)

పై 8వపద్యమునందు కాశీపతికి'మొనగాఁడ'ని బిరుదంబొసంగియూ అతని వాఙ్మూలధోరణి యంతయు నియోగిప్లీడరుబోధ వలననేగల్గిన దనుట యీ క్రింది పద్యము నందు గల్గినది. చూ॥

చం॥ ఇతని స్వభావసిద్ధమయి యేర్పడుధోరణికా దితంతయుఁగా
"ఋతుమతికిఁగా వితంతవున' కేల వివాహము సేయరాదటం
చతిశయ వాదముల్ సలుపు చంబుధియానముసేసి వర్ష్యపుం
జ్యోతినొనరించు ప్రాజ్ఞుఁడగు నొక్కనియోగివకీలుబోధయా(12)

ఇంక ప్రతివాదుల రెండవ సాక్షినిగూర్చి తనశక్తికి మించిన వ్యాఖ్యతో 'ఒల్లమాలిన పండితు సుక్తి సరణి'యని వ్రాక్రుచ్చెను. గావున నా సాక్షి వాఙ్మూలము నిట పొందుబరచ బడుచున్నది. తిలకింపుఁడు.

"నాపేరు వెలవర్తి యాంజనేయశాస్త్రి..." సిద్ధాంతకౌముది పాణినీకృతమగువ్యాకరణము దీని 326 వ పేజీలో రథకారశబ్దమునకర్థము బ్రాహ్మణుఁడని చెప్పబడియున్నది. నేను 2వ ప్రతివాది నెఱుఁగుదును. అతఁడు బ్రాహ్మణుఁడు. సామాన్యముగా విశ్వబ్రాహ్మణశబ్దము బ్రాహ్మణుల కుపయోగింతురు. వానిమూలము నాకుఁ దెలియదు. వైదికులను నే నెఱుఁగుదును. కొన్నిశాస్త్రములలో వైదికులు బ్రాహ్మణులు కారని వ్రాయఁ బడియున్నది. వజ్రసూచి కోపనిషత్తులో వశిష్ఠుఁ డూర్వశీ కుమారుఁడని చెప్పఁ బడియున్నది. ఈ యూర్వశి సంకరజాతీయురాలైనభోగస్త్రీ. వైదికులందఱికినివసిష్ఠునియొక్కయు వశిష్ఠుని సంతతివారి యొక్కయు గోత్రములై యున్నవి. కాఁబట్టి వైదికులు బ్రాహ్మణులుకారని నేను చెప్పుచున్నాను. వశిష్ఠుని భార్య చాలహీనజాతిది. ఈ సంగతి మను స్మృతి 9వ యధ్యాయము 23వ

వరా: "వెలవర్తి అంజనేయశాస్త్రి" గారు అని తనపేరిట నొకసంస్కృతపాఠశాలను నెలకొల్పి దానికొఱకు తన ఆస్తి నంతను వ్రాసియిచ్చి పాలనంబునకు 8 గురు పంచాయితీలతో రిజిష్టరుచేయించి యుండెను. ఇప్పటికి హాస్టలు వసతినికూడ కల్పించుచు, విద్యార్థుల సౌకర్యార్థము ఆ పాఠశాల తెనాలి గాంధిచౌకు, శ్రీవీరబ్రహ్మేంద్రాలయావరణమందు జరుపుచున్నది 'స్వర్ణకారవ్యవహార' గ్రంథమునందీ మహాశయుని పేరు వెలవర్తి...అని యుండుటఆసాక్ష్యవాఙ్మూలమందుగూడ వాదిద్వైన యా గ్రంథకర్త భావభేదములు కలిగియుండనోపునని తోచెడిని. ప్రాజ్ఞు లిట్టివానిని గ్రహింతురుగాక.

శ్లోకమందున్నది. శక్తి, పరాశర, వ్యాస, అంబరీష, యౌవనా

---

N. B. ఇటీవలి శాసన చరిత్రాదులిట గమనార్హములై యున్నవి. కాన 1950వ జనవరి. 1950వ ఏప్రియల్ "భారతి" సంచికలయందు శ్రీ భావరాజు వెంకటకృష్ణారావుగారు గావించిన ప్రచురణశాసనములు, వ్యాఖ్యయందలి ముఖ్యాంశములు నిట నుదాహరింతును వీక్షింపుడు.

"శాలంకాయన నృపతుల తామ్రశాసనములు రెండు - గుదు (గుత్తు) లు కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా 'కానుకొల్లు' గ్రామమున సుమారు 15 సంవత్సరముల క్రిందట పాటిమట్టికొరకు కోటగోడలు మొదలగునవి త్రవ్వుచుండగా దొరకెను ... ఈ గుదులు రెండింటిమీద రెండు శాసనము లున్నవి. ఒకటి ప్రాకృతభాషలో నున్నది. రెండవది సంస్కృతములో నున్నది." "ఈ రెండు శాసనములను అతి ప్రాచీనకాలమున, అనగా క్రీ॥ శ॥ 3వ శతాబ్దమునుండి 5వ శతాబ్ద ప్రారంభము వఱకు, ఆంధ్రదేశ భాగమైన వేంగీదేశము నేలిన శాలంకాయన రాజవంశమునకుచెందిన భూపాలురచే నొసంగబడెను"

ఈ (మొదటిగుత్తి) శాసనపు రేకులు (ప్రతిఒక్క రేకు) ఏడుంబావు అంగుళముల పొడవుగల్గి, రెండుమున్పావులిక అంగుళముల వెడల్పులో మంచి మందముగా (8 రేకులు) ఉన్నవి. ఈ శాసనపు గుదిని (రేకులను) తూచగా 67 తులముల బరువున్నది. రాజముద్రికయు, కడియము (రేకుల తగిలించిన దీగయు) ను గలసి తూచగా 16 తులముల బరువున్నది... ఈ శాసనము నందివర్మ మహారాజుయొక్క దానకార్యమును జాటుచున్నది. దానము వేంగీపురమునుండి చేయబడినట్లు ఆజ్ఞాపింప బడియెను. బప్పభట్టారక పాదపరిగ్రహీతుడైన నందివర్మ మహారాజు 'పిడిమ' గ్రామమును తనకు ధర్మ, ఆయు, బలము వృద్ధిపొందుటకును, బాలకమహారాజగు కుమారఖండపోతన (స్కందపోతన) యశము వృద్ధిపొందుటకును ఒకానొక రథకారకులజుండైన చతుర్వేదోపాధ్యాయునికి అగ్రహారముగా రథకారవిధాన (వాస్తుపురుషార్చనముగా) దానము చేసెను ... శాసనపు తేది విజయరాజ్య సంవత్సరము పుష్యమాసమున కృష్ణపక్షమున దశమి యని తెలుపబడినది. పెల పేరు శుక్ల, కృష్ణపక్షముల తిధులు తెలిపిన శాసనములు ఋతువులు తెలిపిన శాసనములకంటె కొంచెము తరువాతివి; కావున ఈ కారణమును బట్టికూడ విజయదేవవర్మ (రెండవశాసన స్కందవర్మ) కంటె యున (యీ మొదటిశాసన) నందివర్మ ఎక్కువ ప్రాచీనుండని, అతనికి నిశ్శంకగా బూర్వుండని నిశ్చయింప వీలు కలుగు చున్నది." "కానుకొల్లుకు 5, 6 మైళ్లదూరమున పడమటిదిశగా 'పెద్వేగి' అను ప్రాచీన

శ్వులు బ్రాహ్మణులకు బుట్టలేదు. వైదికుల... గోత్రములీ ఋషుల

---

అగ్రహారము గలదు. ఒకవేళ ఆ పెయ్యేరు ప్రాచీనపు (ఈ శాసనములోని) పిడిహో గావచ్చునని ఊహింపవచ్చును. జనుల నోట 'పిడిహ' 'పెయ్య' 'పెయ్యె' అయి 'పెయ్యేరు' అగుటకు అవకాశమున్నది", "ఈ శాసనమునందలి విషయము లన్నింటిలో ప్రతిగృహీత విషయము ముందుగా మనసు కెక్కును. అగ్రహారమును ప్రతిగ్రహించిన చాతువెజ్జ (చతుర్వేది) రథకార కులజుండు.

"విశ్వబ్రాహ్మణులకు వేదాధికార మున్నది. ఇప్పటికిని రథకార (బ్రాహ్మణ) కులము వారమని తెలుపుకొను విశ్వబ్రాహ్మణశిష్టులు వేదాధ్యయన, అధ్యాపకములును చేయుచున్నారు", ఆర్య (హారిత, విశ్వామిత్రాది గోత్రజులగు) బ్రాహ్మణులకు, విశ్వ (వేదోదిత; బ్రహ్మముఖోద్భవులైన సానగాది పంచార్ష గోత్రజులగు) బ్రాహ్మణులకునుగల సంబంధ మెట్లుండెను? ఇత్యాది విషయములు చర్చనీయములు చాల గల్గుచున్నవి." ... "క్రీ॥ శ॥ ఏడవ శతాబ్దమునకు బూర్వము, శంకరభగవత్పాదులు అవతరించుటకు బూర్వము వేదములు పౌరుషేయములుగా గ్రహించి యుండిరో లేక అపౌరుషేయములుగ గ్రహించి యుండిరో ఎఱుగరాదు; కాని శంకరభగవత్పాదులు మాత్రము ఆర్యబ్రాహ్మణ సంఘమునకు వేదము లపౌరుషేయములనియే శాసించెను. నాటి (7వ శతాబ్దము) నుండి విశ్వబ్రాహ్మణులు ఆర్యబ్రాహ్మణ సంఘమునకు మిక్కిలి దూరమైపోయినట్లు తోచును. విశ్వబ్రాహ్మణులు - అనగా రథకార (బ్రాహ్మణ) కులము వారు వేదములు పౌరుషేయములని వాదింతురు. ఆవిశ్వాసమే (ఈ రెండు సంఘములలో) తెగని స్పర్థను కల్పించెను."

"వేదవిప్రులగు బ్రాహ్మణులు రథకారకుల విషయములు నిర్ణయించుట కూడ ఒకముఖ్యమైన విషయము" "రథకార కులము వేదములందుకూడ కలదు" (అని 25 పుటలో) నిర్వచించియు శిష్టులచే అప్రమాణ గ్రంథములుగ నిరూపింపబడిన వానిని; ఆ శిష్టసంప్రదాయ పరిజ్ఞానమును పాటింపలేని ఆంగ్లేయుల వ్రాతలను ఆధారము చేసికొని కొంత అక్రమప్రశంస నొనర్చి యుండెను. దానిని తదుపరి విమర్శింతుము గాక బ్రహ్మశ్రీ సూరిగుచ్చి కృష్ణమూర్తి ఎం. ఏ. (మద్రాసు గవర్నమెంటు ఆర్ట్సు కాలేజి లెక్చరరు) గారి సహాయమున వేంగి ప్రాకృతశాసన (8) రేకులలోని 41 పంక్తులంగల లిపికి తెలుగక్షరములను రెండవశాసన (4 రేకులు) సంస్కృతమును తెలుగులిపి నొనర్చినట్లు ప్రచురించి యుండుటచే శ్రీవారికిని మా కృతజ్ఞతం దెలుపుచు వానినిటం బ్రచురించుచున్నాను. చూడుడు; ఆ వరుసవారి తెలుగక్షరముల శాసన ప్రతులు.

(౧ వ రేకు ౨వ వైపు)
విజయ వేంగీపురా బప్పభట్టారక
పాద పరిగ్గహీతస్స మహారాజ
సిరీ నందివం మస్సవచ కౌనపి.

(౨ వ రేకు ౧ వ వైపు)
ది హగ్గామె ముత్యదప్పను హొగ్గామె
సవ్వ సమగ్గో పవ్వాయో గ పెసన
కలపుత్త భడ మనుస్సాభాణి తివ్వా

(౨ వ రేకు ౨ వ వైపు)
ఇనాహి అమ్హ ధమ్మాయు బలము వద్ధ
నత్థం బాలక మహారాజ కుమార
ఖండపొత్తస్స యసత్తి సత్థియనం

(౩ వ రేకు ౧ వ వైపు)
ఇచ్ఛత్తేణ మయా ఎతస్స సాపాను
గ్గహాసమధ్త ♦ స్సకా (త) నాగొత్త చ
రణతస్సజ్ఝాయ నిరతస్స

(౩ వ రేకు ౨ వ వైపు)
అగ్గహార రధకార చాతువెజ్జస్స
ఎస 'పిదిహ' గ్గామె అగ్గహార ర
ధకర విధానెన సంపదత్తో తస్సయ

(౪ వ రేకు ౧ వ వైపు)
అగ్గహార స్స ఇమె పరిహారె
కవితరామి అప్ప పుసం అణ
మసం అలోనఖాతకం అరత్థ

(౪ వ రేకు ౨ వ వైపు)
సంవిన ఇకం అచొల్లక కూరక ఖట్ట
గ్గహణం అవారిత పంణసాక
పుప్పఫల దుద్ధ దధి ఘత

(౫ వ రేకు ౧ వ వైపు)
తక్కగ్గహణ మాదికం ఏతేహి
పరిహారె హిసెసె హిపి అ
లిహిత చుక్కలి హితె హిసవ్వ

(౫ వ రేకు ౨ వ వైపు)
జాత పరిహారెహి పరిహా
ధ పరిహారాపె ధ చ యోచ
ఖు ఎతం సాసనం అప్పమానం

(౬ వ రేకు ౧ వ వైపు)
కాత ప్పణబాధం పీలం జనెజ్జో
తస్సం ఖు న పరిత్య స్సజమ్వా
త్తి భవతి చా(శ

(౬ వ రేకు ౨ వ వైపు)
స్వదత్త మ్పరదత్తం వాయో నృపో
నోద్ధరే ద్ధరేత్ జాతే జాతే

(౭ వ రేకు ౧ వ వైపు)
సపిబతి విషషద్వ లహాలమ్
హాలమ్బహు భివ్వ సుధా దత్తాబహు

(౭ వ రేకు ౨ వ వైపు)
భిశ్చాను పాలితం యస్య
యస్య యదా భూమి స్తస్య తస్య
తదా ఫలమ్

(౮ వ రేకు ౧ వ (లో) వైపు)
సవ వాత్త దివ హాత్తి సామి
అణతీ మహారాజపుత్తో కొగల
పుత్తో హదప్పగ్గాహా చెత్య వరోయను

♦ ఈ ప్రతిగ్రహీత శాపామగ్గసమధ్ధ స్సనాతనగోత్రాచరణ తపస్స్వాధ్యాయ

సంతతి లోనుండి వచ్చినవి కాబట్టి యెంతమాత్రము బ్రాహ్మణులు కారు. హారితుఁడు క్షత్రియకులస్థుఁడు. వాడిది (వైదికి) హారితస గోత్రము. హారితుఁడు క్షత్రియుఁ డన్నసంగతి యేగ్రంథములో నున్నది చెప్పలేను" ("పురాణ నామచంద్రిక" అను గ్రంథము 233 పుటలో నున్నది.)

---

నిరతుండని యెఱుంగునది. రెండవదియైన తామ్రశాసనము నాలుగు రేకులు. రేకు (1కి) పొడవు 7 అంగుళములు; వెడల్పు 2 అంగుళములు- (ఈ) నాల్గు రేకులు తూఁచగా 78 తులముల బరువున్నది. దానశాసనము శాలంకాయన స్కందవర్మ మహారాజుచే నాతని విజయరాజ్యము ప్రారంభమయిన మొదటి సంవత్సరమున నొసగబడెను." (4 రేకులపైగల శాసన శ్లోకమిది.)

---

"స్వస్తి విజయవేఙ్గ్యా అనేక సమర ముఖవిఖ్యాతకర్మ
(మ్మ)ణః మహారాజశ్రీ హస్తివర్మ్మణః ప్రపౌత్రస్య
స్వప్రతాపా పానీతాహిత వర్మ్మణః మహారాజశ్రీ
నన్దివర్మణః పౌత్రస్య చతురుదధితరఙ్గ లిఙ్గిత
యశసో మహారాజశ్రీ హస్తివర్మ్మణః పుత్రస్య
భగవచ్చిత్ర రథస్వామి పాదాను ధ్యాతస్య
బప్పభట్టారక పాదభక్తస్య శాలఙ్కాయనస్య
మహారాజశ్రీ స్కన్ద వర్మ్మణో వచనేన కుద్రహారే
కొప్పెర గ్రామేయ కావస్తవ్యా అస్తి అస్మాభిరస్మ
త్కులయశ శ్రీ (విజ)య కళ్యాణాభివృద్ధయే
ఏష గ్రామః రథకారవ (వా) స్తవ్యాయ చాతుర్వేద
యత్వా సర్వపరిహారేణ బ్రహ్మదేయం కృత్వాదత్తః
తదవగమ్య పూర్వమర్యాద్యయా సాధు ప్రేష
ణం కర్తవ్యమపిచ సర్వనియోగ లియుక్తాయుక్తకాశ్చ
తం గ్రామం పరిహారస్తు ప్రవర్ధమాన శ్రీ విజయ
రాజ్య సంవత్సరే ప్రథమే కార్తీకమాస
శుక్లపక్ష ప్రతిపది దత్తా పట్టికా
బహుభి ర్బహుధా దత్తా వసుధాధిపైః
యస్య యస్య యదా భూమిః తస్య తస్య తదా ఫలమ్."

---

"సానగ, సనాతన, అహభూన, ప్రత్న, సుపర్ణులను 5 గురు ఋషులు ప్రతివాదుల (విశ్వబ్రాహ్మణుల) జాతికి, బూర్వీకులు, వీరు బ్రాహ్మణులు; మహాగోత్ర ఋషులందరును వీరి సాంప్రదాయము. ఈ 5 గురు పంచముఖబ్రహ్మ 5 ముఖములనుండి ఉద్భ

---

"రథకర" మని యింకొక గ్రామముగూడ నుండినట్లు (ఈ రెండవ) శాసనమువలన దెలియుచున్నది "రథకరము". ఒకవేళ 'పిడిహ' (అను మొదటి శాసనాగ్రహారము) గ్రామమునకు (తదుపరి యేర్పడిన) మారు పేరేమో తెలియదు."

౧౨, ౧౩, ౧౪, ౧౫ శతాబ్దములనాటి శాసనములందు 'కుద్రహార' మని 'గుద్రవార' మని 'గుద్రార' మని చివర 'గుడివాడ' యని యీ యూరిపేరు గానవచ్చుచున్నది. కావున పైన నుడివినట్లు ప్రాకృత నామము 'కుద్రహారము'; దానికి సంస్కృతము 'గుద్రహారము'. అది ఆంధ్రమున గుడివాడ అయినది". కావున నీ రెండవశాసనాగ్రహారము కృష్ణాజిల్లా "గుడివాడ"యే యని చెప్పవచ్చును. మొదటిదగు "...శర్మ ప్రాకృత శాసనమున పరిగ్రహీతయగు రథకారచాతువెజ్జకును; ఈ శాసనపరిగ్రహీత "రథకారచాతుర్వైద్యకును ఎట్టి సంబంధముండెనో తెలుపు సాధనము లేమియు (ఇంతకన్న) గానరావు. మొదటి పరిగ్రహీత వంశజుడు కానగును. రెండవ (ఈ) పరిగ్రహీత అని మాత్ర మూహింపవచ్చును. ఉభయులు రథకారకులజు లగుటయు, ఉభయులును చతుర్వేదు లగుటచేతను ఈ రెండు శాసనములు ఒకేచోట లభించుటయు ఈయూహకు బలమొసగుచున్నది. లిపి పరిణామ శాస్త్రదృష్టితో పరికించి నపుడు (మొదటి) ప్రాకృతశాసనమునకు ఈ (సంస్కృత) శాసనమునకు నడుమ ఒకశతాబ్దము వఱకు ఉండవచ్చునని యూహింపవచ్చును. ఆకాలమున చతుర్వేదోపాధ్యాయులయిన రథకారకుల మొకటి ఆంధ్రదేశమున వర్ధిల్లి యుండెననుటకు ఈశాసనములు రెండును ప్రమాణములు. "రథకారాధికరణ విచారః" అను గ్రంథమును జూచి అందలి విషయమునుగూర్చి "భారతి విరోధి పుష్యము ౨౨ పుటయందే పలువురు పండితులచే విశ్వకర్మవంశజులగు "రథకారబ్రాహ్మణులకు స్వాధ్యాయాద్యగ్నిష్టోమాంతములగు వైదిక సర్వకర్మకలాపములకు సర్వస్వాతంత్ర్యంబు గల"దని సిద్ధాంతీకరించుట... క్రీ॥ శ॥ ౧౯౪౯ వ సం॥ మున జరిగెను. "ఆ నాటి ప్రయత్నమునుబట్టి చూడ రెండువందల సంవత్సరముల క్రిందట మహారాష్ట్రాంధ్ర దేశమున త్వష్టృవంశ సంభూతులగు బ్రాహ్మణులే రథకారబ్రాహ్మణులని యు, ఇతరులు నాచార్యాధికారమునకు అనర్హులనియు సిద్ధాంత మొకటి వెలువడెను." అని శ్రీమతిచే కృష్ణారావుగారు

వించినవారు. ఈ సంగతి నాగరఖండము 114 వ పుటలోనున్నది.”
(పుటల సంఖ్య భేదించినను తాళపత్ర గ్రంథములోని ఈ విషయ శ్లోకములు అచ్చుగ్రంథమునందు రుజువుచేయు గల్గియున్నవి.)

---

గ్రహించియు ‘అన్నియు తెలిసి అధోగతినే అనుసరించి’ నట్లు, అనేకమంది వైదిక, నియోగ, వైష్ణవ బ్రాహ్మణ పండితులచేతనే అప్రమాణగ్రంథములని ఖండింపబడిన “నామలింగాను శాసనము” మున్నగు నానిని అసలు శిష్టసమ్మత పరిజ్ఞాన మేమాత్రము నెఱుంగని యాంగ్లేయుల వ్రాతలను ఆధారముచేసికొని కొంత అక్రమ ప్రశంస నొనర్చుచు “వైశ్యజాతులలో నొకతెగకు చేరినవారని నుడువవచ్చును” అని వాకొనుట విపరీతముగ నుండెను. కావున నా గ్రంథమును గూర్చిన యంశములు పాఠకుల పరిచయార్థమిట గవంబఱచు చున్నాను.

కలియుగాది ౪౯౫౨ సం॥ర ప్రాంతమున పశ్చిమ గోదావరిజిల్లా పేరూరగ్రహారికులగు వైదికులు వైశ్వకర్మణ బ్రాహ్మణగురు శ్రీ సావిత్రీ పీఠాధిపతులగు బసవాచార్య స్వాములవారటకు రాగా కొన్ని ప్రశ్నలచే శంకించి వారి నోడింపవలెనని శ్రీ విజయనగర సంస్థానాధీశ్వరులగు శ్రీమద్విజయరామరాజ భూమీశుల సాన్నిధ్యమున నొక గొప్ప పండితసభ నేర్పరచిరి. ఆ సభకు ఆంధ్ర దేశము నందలి పండితప్రకాండు లెందరో హాజరైరి. ఆ నిండుపేరోలగంబున శ్రీ స్వామిజీ అనర్గళముగా ఆయా కుశ్శంకల నన్నింటిని ఖండించి వేద విప్రులన దేవబ్రాహ్మణులన విశ్వబ్రాహ్మణులే యని ఆ బ్రాహ్మణాంతర్భూతులై రథకారబ్రాహ్మణులని రుజువుపరచి అందుపై ఆ మహాసభ నుండియె కొందరు వైదిక, నియోగ, వైష్ణవాది పండితులు లేచి 47 శంకలను నివారించుచు తమ తమవ్యాఖ్యలను వ్రాతపూర్వకముగా నివ్వ గలిగిరి. తదుపరి శ్రీ పేరూరగ్రహారీకులు శ్రీ స్వాములవారికి “పేరూరి బ్రహ్మరథారూఢః” అను బిరుదముతో పాటు నూటపదారులు సమర్పించి గౌరవించినట్లు తెలియగలదు. ఆయా వ్యాఖ్య అన్నిటిని జేర్చి ౧౮౯౦ -వ సంవత్సరమున డెమ్మీ ⅛ సైజు ౧౪౦ పుటల అచ్చు గ్రంథము కూడ ప్రకటీకృతం బయ్యెను. అందలి ౧౯ -వ ప్రశ్నను వారించిన “కంభంమెట్టు గ్రామనిలయ భట్టుల వెంకటాచార్యేణ రథకారాధికరణే వ్యాఖ్యాతమ్” యొక్క ఆంధ్రానువాదంబిట నుదాహరించుచున్నాను. చూడుడు.

“ఊ. అది అప్రమాణము. అమరసింహుఁడు వేదమునకు అప్రమాణ్యంబును వాదించు వాఁడగుటం జేసి, వాఁడు వచించినది శిష్టసమ్మతంబుగాదు. శిష్టులనగా వేదంబునం బ్రమాణబుద్ధిగల్గి వేదోక్తప్రకారంబుగా నడచునారు. అందువలన

" బ్రాహ్మణోత్పత్తి మార్తాండము 562 వ పుటలోఁ బాంచాలబ్రాహ్మణుల యుత్పత్తి చెప్పఁబడి యున్నది. 5 గురు ఋషులు బ్రాహ్మణులైనట్టున్నది. 5 గురు ఋషులు చెప్పఁబడి

---

శిష్టసమ్మతం బెద్దిగలదో అయ్యది ప్రమాణంబుగాన అమరుఁడు రచించినది (అమరకోశము) ప్రమాణంబు కానేరదు. ... ఈయమరుని వాక్యము సుప్రసిద్ధ ప్రమాణములగు వేదవేదాంగాద్యనేక శాస్త్రములకు విరోధమగుటచే నయ్యది ప్రమాణంబు గానేరదు. ... "ఋభూణాంత్వా దేవానామ్" అనునది మొదలు యజుర్వేద మన్త్రి బ్రాహ్మణకల్పము లందు రథకారులకు ఆధానాధికారము సిద్ధాంత మగుచున్నది. ... వేదబాహ్యుఁడగు నమరుఁడు రచించిన నామలింగానుశాసనము ప్రమాణంబుగాదు ... రథకార బ్రాహ్మణులుత్తమవంశజులే. (ర॥ క॥ విచారః పుట ౬౯-౬౭)

మఱియు నీ శంకను వారింప బ్రహ్మశ్రీ "పెనుమంచలి గ్రామనిలయ బులుసు బుచ్చన్నశాస్త్రిణాం రథకారాధికరణే వ్యాఖ్యాతమ్" ఆయాంధ్రీకృతింగూడ కొంత యిట నుదాహరించుచున్నాను.

"ఉ॥ అది మూలచ్ఛేదంబు, ఋగ్వేదంబున వైశ్యులు జనించిరి. యజుర్వేదంబున క్షత్రియులకు - సామవేదంబున బ్రాహ్మణులకు జన్మస్థానము - ఈ శ్రుతులచేత పాఠక్రమంబున వైశ్యుండు ప్రథమంబునఁ జెప్పఁబడె ననన్తరంబున క్షత్రియ బ్రాహ్మణులు చెప్పబడిరను వైశ్యునికి అగ్రజత్వముగల్గినాళ్లీ ఈ విధముననే రథకారుల విషయముగ నాలోచింపుఁడు. మరియు బృహస్పతి దేవపురోహితుఁడు. బ్రాహ్మణులు సర్వదేవతలు - బ్రాహ్మణుఁడు బ్రహ్మయొక్క ముఖంబయ్యెను. వసన్తకాలంబున బ్రాహ్మణుఁడు ఆధానము సేయవలయునని మొదలగు శ్రుతులుచేత బ్రాహ్మణులకు అగ్రజన్మము సిద్ధించునట్లు త్వష్టపుత్రుఁడగు విశ్వరూపాచార్యుఁడు దేవపురోహితుఁడు - అగ్రజుండైన త్వష్ట ఈ భువనంబుల నుత్పాదించెను. త్వష్ట మనుష్య పశ్వాదుల కధిపతి. త్వష్ట స్వర్గరహితంబగు వజ్రంబు నమర్చె. త్వష్ట దేవతక్షుఁడు - తక్షుఁడు, వర్ధకి, త్వష్ట, రథకారుఁడు కాష్ఠతత్ వీరు కాష్ఠముం జెక్కువాండ్రు. తక్షూ త్వష్టా ఈ రెండు ధాతువులును దనూకరణంబున వర్తించును. వర్షాకాలంబున రథకారుఁడు అగ్న్యాధానంబు సేయవలయునను నివి మొదలగు శ్రుతుల చేత రథకారులకు బ్రాహ్మణులలో నన్తర్భావము సిద్ధము. (ర॥క॥విచారః పుట౯౭)"

యుండబట్టియు మాపూర్వీకులు (గోత్రఋషులు) కూడ నీ 5 గురు ఋషులే కాబట్టియు మాజాతికి వీరేఋషులైనట్లు చెప్పుచున్నాను."

"పైని జెప్పంబడిన 5 గురు ఋషులు కృష్ణయజుర్వేదము 41 వ పుటలో యాగములయం దార్త్విజ్యము చేయువారని చెప్పఁ

---

మఱియు 3రవ శంకపై బ్రహ్మశ్రీ "అనకాపల్లె కాపురస్థుఁడు వీరవల్లి శ్రీనివాసాచార్యేణ రథకారాధికరణే వ్యాఖ్యాతమ్" అగుటఁ దానిం గూడ నిం దుదాహృతము.

"ఉ. ఇట్టులనం జనదు. రథకారులు విశ్వకర్మ వంశోత్పన్ను లగుచుండఁగ విశ్వకర్మయు దేవపురోహితుం డగుచుండఁగ బ్రహ్మపాదంబున నుత్పత్తి పెన రాకయుండఁగ (వారికి) బ్రాహ్మణ్యంబు నిస్సంశయంబుగాన న్ష్టమవర్షంబున ముపనయనము సేయదగినదే." ర. క. విచారః పుట ౧౦౦.) మఱియు 3ర వ శంక. "నవ్వథాపి రథకారాణాం బ్రాహ్మణ్యం కుతః?" అనుదానికి సమాధానముగా నీ అనకాపల్లి గ్రామ నిలయ వీరవల్లి శ్రీనివాసాచార్యేణ రథకారాధికరణే వ్యాఖ్యాతమ్"బు నట్లే ప్రచురింతును.

"ఉ. నచవేదాధికారస్య క్రత్వధికారస్యచ విశ్వకర్మ వంశజత్వస్యచ సత్వాద్బ్రాహ్మణ్యమవికలమితి వాచ్యమ్."

"విశ్వరూపోవై త్వాష్ట్రః పురోహితో దేవానా మాసీదితి శ్రుత్యా త్వష్ట్రజన్యస్య విశ్వరూపస్య దేవపురోహితత్వ ప్రతిపాదనాత్. నహి క్షత్రియ వైశ్యయోర్యస్య కస్యాపి పౌరోహిత్యం శ్రూయతే? తస్మాత్ పౌరోహిత్యస్య బ్రాహ్మణ్య సంపాదకత్వా త్పురవర్తిత్వేన బ్రాహ్మణ్య సిద్ధే ఇదానీంత న రథకారాణామపి భారత, భాగవత, రామాయణ, స్కాంద, విష్ణుపురాణాదిషు త్వష్ట్రవంశజత్వేన మనుష్యవర్తిత్వేనచ ప్రసిద్ధత్వాత్ బ్రాహ్మణ్యం సిద్ధమ్. కించ క్షత్రియ వైశ్యయోః "బాహూరాజన్యః కృతః ఊరూతదస్య యద్వైశ్యః" ఇత్యుత్పత్తిశ్రావ శ్రవణాత్ రథకారకాణాం తదశ్రవణాత్ మీమాంసా విజ్ఞానేశ్వరాదౌ వేదాధికార క్రత్వధికార శ్రవణాచ్చ బ్రాహ్మణత్వ ప్రాప్తిః."

"రథకారేషు పౌరోహితస్య శ్రవణాత్ క్షత్రియవైశ్యయోస్తద శ్రవణాత్ బ్రాహ్మణేష్వన్తర్భావో యుక్తః"(ర.క.విచారః.౧౪,౧౫,౧౬.పుటలు.)

ఇంకనుగల "బొబ్బిలి గ్రామ నిలయ వెంకటకృష్ణదీక్షితులు, "వెంపటి కొండావధానులు" మొదలగు పండితుల వ్యాఖ్యలు ద్వితీయ ముద్రణంబున అవసరంసగుచో ప్రచురింప గలము.

బడియున్నది. అహాభూన ఋషియే త్వష్టయని పిలువఁబడును. అహాభూనునకు విశ్వరూపాచార్యుఁడను కొడుకుండెను. అతఁడు దేవతలకు బురోహితుఁడు. కృష్ణయజుర్వేదము 92వ పుటలో నిట్లు చెప్పఁబడి యున్నది." "భాగవతములోఁ ద్వష్ట మనుమఁడు ద్వాష్ట్రుఁ డనియు...నతఁడు బ్రాహ్మణుఁడనియు చెప్పంబడినది."

"విష్ణుపురాణములో విశ్వకర్మ బ్రహ్మావతారమని చెప్పం బడియున్నది. మనుస్మృతి 3 వ యధ్యాయము 151 వ శ్లోకములో గ్రామపురోహితుని శ్రాద్ధమందు భోక్తను చేయకూడదని చెప్పం బడియున్నది. 12 వ యధ్యాయము 95 వ శ్లోకములో వేదవిరుద్ధము లగుధర్మశాస్త్రములు ప్రమాణముగానంగీకరింపబడవనియున్నది."

"మేము షోడశకర్మలు చేయుచున్నాము. మేము వేదోక్త ముగాఁ గర్మలు చేయుచున్నాము. మామూలుగా విశ్వబ్రాహ్మణు లని బిలువబడు మాబ్రాహ్మణులలో షోడశకర్మలు చేయించువా రున్నారు."

"విశ్వరూపోవై త్వాష్ట్రః పురోహితో దేవానామాసీదితి శ్రుత్వా త్వష్ట్రుజన్యస్య విశ్వరూపస్య దేవపురోహితత్వ ప్రతిపాదనాత్" "త్వష్ట్రు వంశజత్వేన మనుష్యవ్యక్తిత్వేనచ ప్రసిద్ధత్వాత్ బ్రాహ్మణ్యం సిద్ధమ్" అని మహామహులగు పండితోత్తములు నిర్వచించి యుండ అపస్మారకస్థితి (సంఘ)గ కొందరు అక్రమధోరణి ననుసరించినం బ్రయోజనం బేమి?

సర్వత్రా పితరుల సుగతికై గావించబడు అపరకర్మ కాండంబులఁదగి విశ్వదేవస్థాన హవిర్భాగము (పాత్ర) ను పుచ్చుకొనువారు ఆవిశ్వరూపాచార్య వంశజులగు విశ్వబ్రాహ్మణులేయగుట జగద్విదితము.

ఇటీవల వశిష్ఠ విశ్వామిత్రాది ఋషిగోత్రీకులగు [illegible] పురోహితులు లీవిశ్వేదేవస్థాన పాత్రను తీసికొనుట కుపక్రమించు చున్నట్లు తెలియుచున్నది. "పాత్రవిసర్జనంబులేని ఉపకారంబేని పాపకార్యంబగు" నను [illegible] ప్రాజ్ఞులు గమనింతురు గాక. ఒకప్పుడిట్లే గుంటూరుజిల్లా నర్సారావుపేట తాలూకా గ్రామంబున నొక ప్రముఖ కుటుంబమునకు చెందిన కస్తూరివారియింట గలిగిన

"బ్రాహ్మణులమైన మేము సామాన్యముగా గ్రామపౌరోహిత్యము చేయము. అచ్చటచ్చట, నీపౌరోహిత్యము చేయువారు కూడనున్నారు."

"సభలలో దాంబూలము లిచ్చునప్పుడు గ్రామపురోహితులకు ముందుగా నిచ్చుట లేదు. వారి యెడలఁ గనఁబఱచు నగౌరవంబిది యొక్కటి మాత్రమే."

"నేనిదివఱ కుదాహరించిన యైదుగురు బ్రాహ్మర్షులు బ్రాహ్మణ కన్యకలఁ దప్ప (ఇతరులవలె నితరులఁ) బెండ్లాడినట్లు లేదు."

"పైని జెప్పఁబడిన (సానగాది ఋషులైదుగురు) తప్ప మరియే (విశ్వామిత్రాది) ఋషులును ఆదిబ్రహ్మనుండి పుట్టలేదని తేలుచున్నది."

---

అపరకర్మకాండములో వృషోత్సర్జన, యూపదారు పూజాది హవిర్ద్రవ్యము వైదికపురోహితులు గ్రహింప ప్రయత్నించి విఫలులైనట్లిక్రిందనుగాహరింపబడు తీర్పువలనం దెలియగలదు. చూడుఁడు: ఇందు వాదులు:- విశ్వబ్రాహ్మణులు. ప్రతివాదులు:- వైదిక పురోహితులు.

ఉభయవాదులు ఎన్నుకొన్నట్టి న్యాయమూర్తి:— 'కవిరాజు, శతావధాని'
శ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరిగారు, బా రెట్లా.
(తెనాలి మునిసిపల్ చైర్మన్) ఆల్మకాం-నర్సాయపాలెం.

తీర్పు:- "1. మయాచార్యుని పేరిట యూపదారువు చేసియిచ్చినది విశ్వబ్రాహ్మణులు. వాస్తుపురుషుండునూ విశ్వకర్మయె యగుటబై రెండు కారణములచే తత్పూజా సంబంధమగు హవిర్ద్రవ్యాదులు వాదులైన విశ్వబ్రాహ్మణులు మాకే చెందవలెననుచున్నారు."

"2. యూపదారు పూజ బయటజరుగును గాని మంటపారాధన తత్సాన్నిధ్యమున జరుగదు కాబట్టి పౌరోహితులమగు మాకే రావలయునని ప్రతివాదు లనుచున్నారు."

"గార్గేయాగమము 2 వ పుటలో నాగమములు శిల్పాచార్యులచేతనే యాచరింపఁ బడవలెనని చెప్పంబడి యున్నది. ఆ పుస్తకము ముఖ్యముగాఁ బ్రతిష్ఠల విషయములో సంబంధించి యున్నది. 7 వ పుటలో నావాహన మంత్రములు శిల్పులచేతనే యధ్యయనము చేయఁబడవలెనని చెప్పఁబడియున్నది, (ఈ తాళపత్ర గ్రంథమునకు అచ్చుప్రతికి పుటసంఖ్య మాత్రమే భేదింపనైనది.)

వ్రాసు:- మాకుఁ బ్రమాణ గ్రంథములు శ్రుతులు. (శ్రుతి సమ్మతమగు) స్మృతులు. పురాణములు రథమును జేయువారందరు రథకారులని బిలువఁబడ వచ్చును. అదియొక జాతికాదు. ఆపేరు వృత్తిని మాత్రమే తెలియఁ జేయును. వృత్తివలన రథమును జేయువారి కెవరికైనను మొదటి మూఁడువర్గములలో రథకారశబ్ద మన్వయించును."

---

"3. ప్రతివాది ఆపస్తంబ సూత్రుడు. ఆసూత్రమునుబట్టియే కర్మకాండ జరుపుచున్నాడు. అయినను ఆసూత్రమున మంటపారాధన హావిర్ద్రవ్యము విశ్వబ్రాహ్మణుల కీయతలదని యెచ్చటను చెప్పబడియుండలేదు."

"4. మయాచార్యుని పేరిట యూపదారువు సిద్ధముచేసి తీసికొనివచ్చినది విశ్వబ్రాహ్మణులే యని ప్రతివాదులునూ ఒప్పుకొని యున్నారు. నేటి విశ్వబ్రాహ్మణులు విశ్వకర్మసంతతి యనుటకు సందియములేదు. విశ్వబ్రాహ్మణులు యజ్ఞయాగములలో శిల్పభాగమును ప్రత్యేకించి వృత్తిగానిడుకొని జరుపుచుండుట జగద్విదితము. కావున నాభాగమునకు సంబంధించిన కర్మకాండలో రాదగిన హావిర్ద్రవ్యము విశ్వబ్రాహ్మణులకే చెందుట సమంజసమని భావించుచు వారులవృత్తికి సంబంధించినదియు వారులచే నిర్మింపబడుచున్న యూపదారు పూజావిధానమునకు సంబంధించినదియు నగు మంటపారాధనాది హావిర్ద్రవ్యము వారులకే చెందుట యుచితమని భావించి వారికే చెందవలెనని తీర్మానించుచున్నాను. ఇది స్మృతి విరుద్ధమనికాని ధర్మవిరుద్ధమనికాని ప్రతివాదులు నిరూపణ చేయలేక పోవుటచే వారివాదము తిరస్కరణీయము. (Arbirator) శ్రీ. రామస్వామి" అని గలదు. (దేశహితప్రదీపిక నుండి)

"రథకారులను జాతి యొకటి (అప్రమాణ రచనంబులం) గలదు. కాని వారికీ రథముఁ జేయు వృత్తితో సంబంధము లేదు. ఆజాతి సంకరమైనది కాని యసలైనది కాదు. ఆ రథకార వర్ణమిప్పుడు జీవించియున్నదో లేదో నాకుఁ దెలియదు. (ఆ) రథకార జాతికి విధింపఁబడిన వృత్తి యేదియో నేను జెప్పలేను. మా బ్రాహ్మణ జాతిలోఁ దక్షకులను వారులేరు. ఎవరేపని చేయుదురో వారినట్లు పిలుతురు. మాలో నైనను బంగారపుఁబనిచేయు వారిని ♦ గమసాలు రని పిలుతురు. ఆపేరు వృత్తివలన నుత్పన్నమైనది. పంచాణ యని పిలువఁబడు కులము లేదు."

---

♦ కమసాల యనునది "కులనామము కాదు" అను "నీ సంస్థవారిం గూర్చి (1932 నంబరు) లెజస్లేటివు కౌన్సిలులో చేయబడిన తీర్మానముపై 1938 సం॥ నెం. 315 జి. ఒ. ప్రచురింపబడియెను. తదుపరి "విశ్వకర్మలు" అనుటకు బదులుగా 'విశ్వబ్రాహ్మణులు' అని అనవలయును. అని మరియొక నెం. 1470 జి. ఓ. కూడ ప్రకటింపబడియెను. కాని 1950 డిశంబరు "అరుణోదయ" పత్రికలో ప్రచురింపబడియున్న సుదీర్ఘ ఉత్తరప్రత్యుత్తరములలో బ్రహ్మశ్రీ కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు "ఆంధ్రప్రభ"లో ప్రచురించిన వ్యాసమునందు 'కంసాలి' అను పదప్రయోగ మొనర్చుటయు నందుపై సాంఘిక ప్రోద్బలముచే బ్రహ్మశ్రీ ఉభయభాషాప్రవీణ కొండూరు వీర రాఘవాచార్యులుగారు శ్రీ శాస్త్రులవారికి వ్రాసిన జాబులో "...విశ్వకర్మ ఋషిజాతులైన సానగ, సనాతనాది బ్రహ్మర్షి వంశ్యులైన; స్థాపత్యవేద విద్యాప్రవీణులగు శిల్పాచార్యులను గూర్చి విజ్ఞానములేని మూఢమానవులవలె విజ్ఞులగు తాము 'కంసాలి' శబ్దముచే తీర్మానుటలోని యర్థమేమి ?" అని వ్రాసినందుకు ప్రత్యుత్తరముగా శ్రీ కవిసార్వభౌములు వ్రాసియున్న జాబునందలి ముఖ్యాంశములిట నుదాహరించు చున్నాను చూడుఁడు.

"బ్రహ్మశ్రీ ఉభయభాషాప్రవీణ కొండూరి వీరరాఘవాచార్యులుగారికి. అయ్యా! మీరు 17-11-1950 తేదీన వ్రాసిపంపిన జాబిప్పుడే చేరినది ... ఆప్రయోగము "విశాలమగు నొకసంఘమును తూలనాడుట యని భావింపక తప్పుటలేదు" అంటిరి. అట్టిది మీానిశ్చితాభిప్రాయ మైనయెడల మీాతో నేను

"6వ మార్కు దస్తావేజు (సిద్ధాంత కౌముది)లో రథకారో నామ బ్రాహ్మణః యనునది వర్ణమువలన బ్రాహ్మణుఁడై వృత్తివలన రథకారుఁడైన వానికి సంబంధించినది. ఒక బ్రాహ్మణుఁడావృత్తి నవలంబించినట్లు తెలియఁజేయుటకై యది వాడఁబడినది.

"మా ప్రవరఖండ విశ్వబ్రహ్మోపనిషత్తునందు వివరింపఁబడి యున్నది. ప్రవర ఖండకొఱకు నేను బురాణములలోఁ జూడలేదు. వైదికుల గోత్రములను నేను సాంగముగాఁ జెప్పఁజాలను. వారు వసిష్టునియొక్కయు రాజఋషులయొక్కయు సంతతివారు. భరద్వాజ కౌండిన్య ప్రముఖ గోత్రములవారు వైదికులు."

"విశ్వబ్రాహ్మణులని వాడఁబడు బ్రాహ్మణులే నిజమైన బ్రాహ్మణులు. బ్రహ్మజ్ఞానము పేరిట (వసిష్ఠ, విశ్వామిత్ర, హారితులనువారిచే) గలిగిన బ్రాహ్మణు లితరు లుండవచ్చును. మా బ్రాహ్మణులు (ఆ వసిష్ఠాదులరీతి) బ్రహ్మజ్ఞాన (మాత్రమున నే) గాక బ్రాహ్మణులని పిలువఁబడుదురు. ఏలయన (ఆ) బ్రహ్మజ్ఞానము మా సహపంక్తికిఁగాని సహోద్వాహమునకుఁగాని సంబంధింపదు."

"వైదికశబ్దము విశ్వబ్రాహ్మణశబ్దమువలెనే యే (ప్రాచీన) గ్రంథములయందును గాన్పింపదు. ఇతర వర్ణస్థులు సామన్యముగా మా యిండ్లలో భోజనముచేయరు. శూద్రులు కొందరు భుజింతురు. మహాన్యాసము నేర్చుకొనందువలన నే నేశివాలయము లోనికిఁ

---

వాదింప బూనక నాది తప్పేయని యొప్పుకొనుచు నేనీ విషయములో మీకును, మీ సంఘమువారికిన్ని క్షమాపణ మొసంగుచున్నాను. స్వీకరించి నన్ను మన్నింతురాగాక లేదా మీ చిత్తము. నే వ్రాసిన యీ జాబంతయును బత్రికలలో బ్రచురింపవచ్చునని మనవి చేయుచున్నాను.

ఇట్లు,

("అరుణోదయం" నుండి) (సం.) శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి."

బోవుటకుఁ బ్రయత్నింప లేదు. ♦ భట్టిప్రోలులో విశ్వబ్రాహ్మణులచేఁ బ్రతిష్ఠితమైన శివాలయ మొకటి కలదు, అర్చకుఁడు విశ్వబ్రాహ్మణుఁడె. అందరు గుడిలోనికిఁ బోదురు...

---

♦ వరా:— భట్టిప్రోలునందేగాక గుంటూరు. నెల్లూరు జిల్లాలలో సుమారు 200 కు మించిన సంఖ్యలో విశ్వబ్రాహ్మణులచే ప్రతిష్ఠితమైన దేవాలయములు, ధర్మకర్తృత్వము గల దేవాలయములు, అర్చకులుగ నున్న దేవాలయములు నున్నవనుట అతిశయోక్తి గాదు. ఉదాహరణంబునకు గుంటూరు నుండి వందివెల్లు వెళ్లు రోడ్డునందున్న 'ఉప్పలపాడు' అను గ్రామంబునందుగల (1) శివాలయము (2) సుబ్రహ్మణ్యేశ్వరాలయము. ఈ రెండింటికిని ధర్మకర్తలును ప్రతిష్ఠాపకులును విశ్వబ్రాహ్మణులే. మొదటిదాని కిప్పటికిని అర్చకులు వీరే. కృష్ణాజిల్లా చిలకలపూడి (కీరపండరీ క్షేత్రము) శ్రీ పాండురంగవిఠల్ మఱియు భక్తబృంద దేవాలయములు. బ్రహ్మాండముగా తెలంగాణా ప్రజలందరిచేతను గొనియాడంబడుచు నేఁటేట జగన్మోహన వైభవములతో మహోత్సవములు, అనేక కైంకర్యము లిందు జరుగుచుండుట జగంబెరుగును. ఈ ఆలయంబుల ధర్మకర్తలు, ప్రతిష్ఠాపకులు, అర్చకులు విశ్వబ్రాహ్మణులే యైయున్నారు. ఇంక హైదరాబాదు (తెలంగాణ)లో లెక్కకు మిక్కిలిగనె ఇట్టి ఆలయంబులు గలియున్నవి. అందును నుదాహరణంబునకు (1) మహాంకాళిదేవాలయము ( హైదరాబాదు రిజిమెంటల్ బజారు ) సికింద్రాబాదులో సుమారు 600 సంవత్సరములకు పూర్వము బ్రహ్మశ్రీ కాసాల బ్రహ్మయ్యాచార్యులు గారిచే ప్రతిష్ఠితమై నేఁటేట తెలంగాణా ప్రజలనెల్ల నాకర్షించు నవరాత్రోత్సవములు (రథోత్సవముతో సహా) గలిగి విరాజిల్లుచున్నది. దీని ధర్మకర్తలు నేటికిని వారివంశజులే యైయున్నారు. (2) బాద్ర పెరుమాళ్లు (గణేశు) ఆలయము. ఇది తాలూకా కేంద్రమగు 'సిద్ధిపేట'లో నున్నది. ఇందే శ్రీగణేశు విగ్రహప్రతిష్ఠతోపాటు శ్రీఆంజనేయ, శ్రీవీరబ్రహ్మ విగ్రహప్రతిష్ఠలుకూడ విశ్వబ్రాహ్మణుల చేతనే యై అర్చనకూడ వారిచేతనే గావింపఁబడుచున్నది. ఈ పేటలోనే మఱియొక వేర్వేరువీధులలో శ్రీ వీరబ్రహ్మేంద్రాలయము (4) కాళికాదేవాలయములు గలవు. వీనికిని విశ్వబ్రాహ్మణులే ధర్మకర్తలు, అర్చకులునై యున్నారు. (5) త్రిమూర్తి ఆలయము. ఇది కరీమ్‌నగరుజిల్లా, జగిత్యాల తాలూకా 'రాయికల్లు' అను గ్రామమందున్నది. డిటో జిల్లా - తా॥ 'పెద్ద కలువల' గ్రామమందు (6) మహామ్మాయి ఆలయమున్నది. వీటికి ధర్మకర్తలు

"నాది సుపర్ణస గోత్రము. మూల ఋషు లయిదుగురు. ఉప సుపర్ణ శాంతౌరసేన సాంఖ్యాయనులు. విశ్వబ్రహ్మోపనిషత్తుఁ జూచి ఋషులయొక్క సాంప్రదాయము చెప్పఁగలను. ఉపనిషత్తులు నూటయెనిమిదికిఁ బైగాఁ గలవు. సంఖ్య నిశ్చయింపఁ బడలేదు."

"మా మాతామహునిది సానగ గోత్రము. గోత్రఋషుల పేళ్లుపనిషత్తుల యందును, వేదములయందును, బురాణములందును గానుపించును. మాది కాత్యాయన సూత్రము కావలసిన యెడల గోత్రఖండమును జూపింపఁ గలను. విశ్వరూపాచార్యులు బ్రాహ్మణుఁడు. ఆయన సంతతివారు మాకు బంధువులుకూడ నైయున్నారు. భాగవతముకూడఁ బ్రమాణ గ్రంథమే.

"2 వ మార్కు దస్తావేజు (వజ్రకోపనిషత్తు) 343 పుటలో వసిష్ఠుఁ డూర్వశికి జన్మించినట్లు చెప్పఁబడినది ...

"విప్రపదము మాకుఁ జెల్లును. "రథకారో నామ బ్రాహ్మణః యను వాక్య ముదాహరణముగా నీయఁబడినది. అది సంజ్ఞ కుప

---

విశ్వబ్రాహ్మణులే. (7) మహంకాళి ఆలయము. ఇది వరంగల్లు జిల్లాలో 'పెంబర్తి' అను గ్రామమందున్నది. దీని ధర్మకర్తలును, (8) వీరభద్రదేవాలయము. నల్లగొండజిల్లా, సూర్యాపేటతాలూకా 'కడకుడ' అను గ్రామమందున్న దీని ధర్మకర్తలును విశ్వబ్రాహ్మణులే. (9) శివాలయము. ఇదియు డిటో తాలూకా 'ఆత్మకూరు'లో నున్నది. (10) త్రిపురసుందరీ ఆలయము. ఇది నల్లగొండతాలూకాలోని 'తిప్పర్తి' లోనున్నది. వీటి ధర్మకర్తలు విశ్వబ్రాహ్మణులే (11) బ్రహ్మేంద్రాలయము, ఇయ్యది నిజామాబాదులోని 'మాగులూర'ను గ్రామంబు నందున్నది దీని ధర్మకర్తలు, అర్చకులు విశ్వబ్రాహ్మణులే యై యున్నారు. (12) శ్రీ వెంకటేశ్వరాలయము. ఇది 'గజనగరు' తా॥ ఆదిలాబాదుజిల్లా 'గంగాపుర' మందున్నది. దీని ధర్మకర్తలు విశ్వబ్రాహ్మణులే యైయుండిరి గాని ప్రస్తుతమిది యితరుల ఆక్రమణలోనున్నది. (13) విశ్వేశ్వరాలయము. ఇది ఖాజీపేట గల్వేలంక నుకు నిలయంబైన వరంగల్లుపట్టణ సమీపమందున్నది. దీని ధర్మకర్తలు విశ్వబ్రాహ్మణులే. గ్రంథవిస్తరభీతితో నింకను గల వానినిగూర్చి తెలుపజాలనందుకు విచారించుచున్నాము.

యోగింపఁబడి యున్నది. అక్కడ గూడార్థముగా నుపయోగించినది కాదు. ఆపదమునకు యౌగికార్థము కూడ నుపయోగింపవచ్చును. అన్నిటిలోను రూడార్థమే ముఖ్యమైయున్నది. కౌముదిలో యౌగికార్థమునం దుపయోగింపఁ బడినది. షట్కర్మలు వేదమంత్రములతో బ్రాహ్మణులే చేయవలెను, శ్లోకములైన నితరమంత్రములతో నితరులీ షట్కర్మలుచేయవచ్చును. అదికమలాకరములోనున్నది.''

''అగ్రతాంబూలము సభలలో బాగుగాఁ జదువుకొన్నవాండ్ర కిత్తురు. పురోహితుఁడుకూడ సంస్కారియైన నిత్తురు. సంస్కారియైనప్పటికి గ్రామపౌరోహిత్యము చేయువానికి మాత్రి మీయరు. శైవ సిద్ధాంతప్రకారము ఖననము ముఖ్యము. కలియుగములోఁ బరాశరస్మృతి ముఖ్యముగా నవలంబింపఁ దగిన గ్రంథమైయున్నది. స్మృతు లనంతములు. బుక్కరాయనికి విద్యారణ్యులు మంత్రిగా నున్నట్లుతని విషయమైన చరిత్రలో నున్నది. యలవర్తి ఆంజనేయ శాస్త్రివాలు (స్వ. తృ. మొ. 154, 200 పుట వరకు.)

శ్రీ యలవర్తి ఆంజనేయశాస్త్రిగారు వైదికులను వసిష్ఠగోత్రులన్నందుల కీ కవి నియోగి వైష్ణవాదులుకూడ ఆ గోత్రీకులేయని యీ క్రింది పద్యమునందు చెప్పుట గాంచదగినది. చూ.

తే. అరయ వాసిష్ఠ గోత్రముల్ ధరనియోగి, శైవ,వైష్ణవ,మధ్వాదిసకలమహీసు
రులకునుండెను బ్రకృతంబురూఢముగను, వైదికులకొక్కరికెయంచువదర నేల.

శాస్త్రిగారు వసిష్ఠుని తల్లి ఊర్వశియను వేశ్యయన్నందుల కా వేశ్యపొందు (రణంబున గూలిన ముస్లిముఁలకుకూడ గల్గునని యెఱుంగక కాబోలును) పుణ్యకార్య (యజ్ఞయాగాదికార్య) ములొనర్చువారికి మాత్రమే గల్గునని ఆమె గొప్పదనముం గూర్చి చెప్పిన యీ క్రింది పద్యముం దిలకింపుము.

గ్రంథము. ఇది యీతగాదా కనుకూలించు నిమిత్తమై చేయబడిన దని నేను దలంచను.'' అని వ్రాసియున్నట్లు కనంబడుచున్నది.

ఈబ్రాహ్మణోత్పత్తి మార్తాండమున ''లైంగేశైవాగమే'' యని యుండ, నది శివపురాణమని భ్రమించి యొనర్చిన విమర్శ కేమైనం బ్రయోజనంబు గల్గునా? అట్టి దృష్టితో నీవైదికి వ్రాసిన యీక్రింది యంశముల గాంచుడు.

ఆ॥ ''మాది బ్రాహ్మణవంశమట'' మాటవీరు మొదలుపెట్టిరిబహుకాలమునకుమున్నె
కానఁదల్లిఖితంబులౌ కారికలెవో,దొరికిహరి కృష్ణుఁడందులో దూర్చవచ్చు. 113

''డేటు'' లేదట? అసలు తేదీలు వాడునట్టి యాచారము లేక యున్న కాలమునకు ముందెప్పుడో బొంబాయిలో సంస్కృతములో తమజాత్యుత్పత్తిం దెలుపుకొనునట్టి గ్రంథములో నంతకుముం దెప్పుడో బహుకాలమునకు పూర్వము వైశ్వకర్మబ్రాహ్మణులే బ్రాహ్మణులని చెప్పుకొనుచున్నట్టి కారికలు దొరుకుటచేతనే ''హరికృష్ణుం'' డనువాఁడు తన జాత్యుత్పత్తి మార్తాండములో ప్రచురించుకొనియుండ యిపుడితని యాక్షేపణ లెందుకైన పనికి వచ్చునా? ఇట్లె నాగరఖండమునాక్షేపించి యటనే రుజుగ్రంథము. లోని శ్లోకములను గూడ నుదాహరించుట గమనార్హము.

స్కాంద పురాణాంతర్గత నాగరఖండమందలి విశ్వకర్మో పాఖ్యాన ౧౨ అధ్యాయమునగల మనుమయాది *గోత్రఋషులం దెలుపు శ్లోకముల నుదాహరించు చున్నాను.

''శ్లో॥ మనుస్సానగ గోత్రశ్చ సనాతన మయ స్తథా; అహ భూనస్తు త్వష్టుస్స్యాత్ ప్రత్నస్యా చ్ఛిల్పిన స్తథా। తక్ష శ్చాపి

N. B. — * ''శర్మా'' అనుటకు ముందు తమ పేరుచేర్చి చెప్పగల్గు గోత్రకాండ యందలి ప్రవరాదికముల నిట గాంచుడు.

(౧) ఉప సానగ, బిభ్రాజ, కశ్యప, మనువిశ్వకర్మ, విశ్వాత్మక, పంచార్షేయప్రవరాన్విత, వసంతఋతుః, అగ్నితత్వం రుద్రోదేవతా, ను బ్రహ్మద్రవిణం,

సుపర్ణశ్చ హ్యేవంగోత్ర ముదీరితమ్." (చూ. విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమము ౭౯౧ వ పుట.)

ఈ సానగాది ఋషులు తమ కిష్టమనియు తస్సంతానంబు కానట్లీ క్రిందిపద్యము వ్రాసినాఁడు చూడుఁడు.

క॥ సానగ సనాతనాదులు మానులటంచనెడి నూక్తి మాకిష్టమెయా, మానము లేచెట దత్సంతానము వీరలది యనుచుఁ దథ్యముగాఁగన్ (.163)

దర్పణంబునందువలె వేదములు మొదలగు వానియందు పంచఋషులు బ్రాహ్మణులనియు తద్వంశీయు లందరు ఆయా సానగాది ఋషుల గోత్రజులుగ నెన్నఁబడుచుండినను నదిప్రమాణంబు గాదట.

---

పంచవిధస్తోమం, సానగసూత్రం, ఋక్శాఖ, సద్యోజాతప్రవర, త్రికోణకుండం. పాలాశదండం, సానగర్షిగోత్రః ... శర్మాఽహంభోఽభివాదయే.

(౨) ఉప సనాతన, వామదేవ,విశ్వచక్షు,ప్రతిజ్ఞ,సునందన,పంచార్షేయ ప్రవరాన్విత, గ్రీష్మఋతుః, జలతత్వం, విష్ణుర్దేవతా, మయబ్రహ్మద్రవిణం, పంచవిధస్తోమం, మయసూత్రం, యజుశ్శాఖ, వామదేవప్రవర, చతుష్కోణకుండం, వటతరుదండం, సనాతనఋషిగోత్రః...శర్మాఽహంభోఽభివాదయే.

(3) ఉపాహభూన, భద్రదత్త, శాండవ, విశ్వాకార, శ్రీముఖ, పంచార్షేయప్రవరాన్విత, వర్షఋతుః, పృథివీతత్వం, బ్రహ్మదేవతా, త్వష్ట్రబ్రహ్మద్రవిణం, పంచవిధస్తోమం, త్వష్ట్రసూత్రం, సామశాఖ, అఘోరప్రవర, వర్తులకుండం, ఖాదిరదండం,అహభూనఋషిగోత్రః శర్మాఽహంభోభివాదయే.

(౪) ఉపప్రత్న, రుచిదత్త, వాస్తోష్పతి, కౌశల, సనాభస పంచార్షేయ ప్రవరాన్విత, శరదృతుః, వాయుతత్వం, ఇంద్రోదేవతా, శిల్పిబ్రహ్మద్రవిణం, పంచవిధస్తోమం, శిల్పిసూత్రం, అథర్వణశాఖ, తత్పురుషప్రవర, షట్కోణకుండం, అశ్వత్థదండం, ప్రత్నర్షిగోత్రః ... శర్మాఽహంభోఽభివాదయే.

(౫) ఉపసుపర్ణ. విశ్వజ్ఞ,పరితర్ష, సూరసేన, సాంఖ్యాయన,పంచార్షేయ ప్రవరాన్విత, హేమంత శిశిరఋతుః, ఆకాశతత్వం,అర్కోదేవతా, విశ్వజ్ఞబ్రహ్మద్రవిణం, పంచవిధస్తోమం, విశ్వజ్ఞసూత్రం, ప్రణవశాఖ, ఈశాన్యప్రవర, అష్టకోణకుండం, జంబూవృక్షదండం, సుపర్ణర్షిగోత్రః శర్మాఽహంభోఽభివాదయే,

"హరితసగోత్ర ఆంగీరసాంబరీష యూనాశ్వ" యని తమ గోత్రములు చెప్పుకొనుటలో సరాసరివారి సంతానమే తామని చెప్పుకొనుట కేమైన నితనికి ప్రమాణంబులు కారికలకన్న వేరు గల్గినా ? ఎందుల కీతని కీ యసందర్భపు నుడి ?

ఈ జానపాటి పట్టాభిరామశాస్త్రిగారే వ్యాజ్యమునందు వాదియగుటం దాను సాక్ష్యస్థానముంజొచ్చి ప్రతివాదులంగూర్చి చెప్పియున్న వాఙ్మూలమునందలి ముఖ్యాంశంబులనుకూడ నెఱుంగ వలసి యున్నది. చూడుడు.

" దావా దేవాలయములలో తిరిగి ప్రతిష్ట చేయవలెనంటే హీనపక్షము రు. 200 లు కావలెను. " " సూతసంహితలో శివ మహాత్మ్యఖండములో 44 –వ పేజీలో సృష్టిచేయుటలో తనకు సహాయము చేయుటకు 9 మంది ఋషులను సృజించినట్లు చెప్ప బడి యున్నది. విశ్వకర్మ అష్టవసువులలో నొకడయిన విభాసుని కుమారుడని భారతము ఆదిపర్వము 60 –వ పేజీలో చెప్పబడి యున్నది, "

" క్రాసు :– యీ కేసు ఆరంభించినది మొదలు నాసాక్షు లను విచారించేటప్పుడు నేను కోర్టులో వున్నాను. అభినవసరస్వతి పత్రికాధిపతిని నేను. ఆ పత్రిక స్థాపించి 3 యేండ్లు అయినది. నా ప్రతిపత్రికలో ప్రతివాదుల కులమువారిని గుఱించి వ్రాసినాను. నేను దావా దాఖలు చేసిన తరువాత ప్రతివాదుల కులమువారు " ప్రబోధిని " అని ఒకపత్రిక ప్రచురించి దానిలో యీవ్యాజ్య మును గురించి వ్రాస్తే నేను దానికి ఖండనగా అభినవసరస్వతిలో వ్రాసినాను. " " ప్రబోధినిని ప్రతివాదులు ప్రచురింపలేదు. "

" గ్రామమునసబు, పెద్దకాపు ప్రతివాదులు ప్రతిష్ట చేయుటకు కుమ్మక్కు చేసినారు గనుక వారిని ముద్దాయిలుగా చేర్చినాను. "

22–7–1906 సంవత్సరము నేను మాపూరయిన జానపాడులో వున్నాను. ప్రతివాదులలో 1–వ ప్రతివాది ప్రతిష్టకర్మ జరిపినాడు.'' ''1 వ ప్రతివాది నందిగామ తాలూకా (కృష్ణాజిల్లా) వాడు. 1 వ ప్రతివాది చనిపోయినాడు.''

''కాటూరి నారాయుడు, జుజ్జూరి మల్లయ్య 1–వ ప్రతివాదిని పిలిపించినారు. కంసాలి అనే పదమునకు వ్యుత్పత్త్యర్థము చెప్పజాలను. బ్రాహ్మణుడు అనగా బ్రహ్మయొక్క సంతానమని ఒకర్థము – బ్రహ్మ అనే పదములో సంతానము అని అర్థము లేదు. నేను వేదము చదువలేదు. కంసాలురు యితరుల యిండ్లలో భోజనము చేయడము నేనుచూడలేదు. కంసాలులు (మా) బ్రాహ్మణుల యిండ్లలో నీళ్లు త్రాగరు.'' 'దేవతలశిల్పి విశ్వకర్మ.'

'' నాది *హారితసగోత్రము. మాకు అంగీరస, అంబరీష, యౌవనాశ్వ అని ముగ్గురు ఋషులు.''

''మావూళ్లో వారంతా చందాలు వేసుకొని (1వ ప్రతివాది చేత) ప్రతిష్ఠ చేసినారు. ''దావాకు పూర్వము యీ గుంటూరు జిల్లాలో వైదికులు ప్రతిష్ఠ చేయించగా చూడలేదు. నైజాం యిలాకాలో చూచినాను.'' '' పాతపాటమ్మ యిప్పటిశిల కొత్తది తెచ్చినారు. దానిని దుగ్గి (గ్రామము)లో కొని తెచ్చినారు. ఎంతకు తెచ్చినది నాకు జ్ఞప్తిలేదు.''

''విరోధము చేత ప్రతిష్ఠ చేయించినారుగాని బంగారు (యంత్రము) రేకుపోయి సరిగా నిలువకపోతేకాదు. ప్రతివాదులకు నాకు స్వంతముగా విరోధము లేదు. నాకు యెవరితోను విరోధము లేదు. ''మాతండ్రి పౌరోహిత్యము చేసేది. మేము అన్నదమ్ములము చేయ

---

షరా:–*క్షత్రియుడైన '' హారితుడు ఇక్ష్వాకు వంశస్తుడు. యౌవనాశ్వుని కొడుకు. ఇతడు క్షత్రియుడు. వీరి వంశస్తులు 'ఆంగీరసాంబరీష యౌవనాశ్వ' అని చెప్పబడుదురు. (పురాణనామచంద్రిక 233 వ పుట 1879 సం॥ముద్రణ)

డము లేదు. నాకు పొలము వున్నది. అది పాలికిచ్చి నేను అష్టావధానము చేస్తాను గనుక సభలుచేసి జీవిస్తాను...జానపాటి పట్టాభిరామశాస్త్రి వ్రాలు" (అనివున్నది) (స్వ 141-142-143 పుటలు)

ఇంక నాయూరి కరణము "జానపాటి రంగయ్య (నియోగి బ్రాహ్మణుఁడు.) జానపాడు." ఈతఁడు చెప్పిన సాక్ష్యమునందలి ముఖ్యాంశములనుకూడ నిట ( స్వ. వ్య. 200 పుట నుండి ) తిలకింపుడు.

"మా గ్రామములోఁ జాతపాటమ్మ, పోలేరమ్మలను రెండు దేవతలు కలవు...విలేజిమున్సిఫు బొగ్గవరపు బెదయచ్చయ్యయు, నున్నము చినవీరయ్యయు సీగుళ్ళ పెత్తనదారులు. వారు చందా వసూలు చేసిరి. వైదికులుకాని. నియోగులుకాని యీ దేవతలఁ బూజింపరు....వాదికాని, వాదికుటుంబములోఁ జేరిన మఱియొకరు కాని యెప్పుడు నీ దేవతలఁ బూజించి యుండలేదు. ఏడేండ్ల క్రిందట రైతులీ రెండు దేవతలకు నారాధ్యునిచేతఁ బ్రతిష్ఠ చేయించిరి. యంత్రము వేసి విగ్రహముల క్రిందనుంచఁబడిన బంగారపు రేకు పోయినది. అందువలన దేవతల సత్తా తొలగినదని గణాచారులు చెప్పిరి. అందుపై గ్రామస్థులు ... (1 వ ప్రతివాదియైన చోలేటి లక్ష్మయ్యచేత)మరలఁ బ్రతిష్ఠ చేయించిరి....1వ ప్రతివాది ప్రతిష్ఠ చేసినతర్వాత దేవతల గ్రామస్థులు పూజించుచునే యున్నారు. ప్రతి సంవత్సరము నీలైనపుడెల్లఁ గొలుపులు చేయుచున్నారు. కడపటి ప్రతిష్ఠ జరిగినతర్వాత నాలుగు కొలుపులు జరిపిరి. ఇప్పటికి 2 మాసముల క్రిందటఁ గడపటి కొలుపు జరిపిరి."

క్రాసు:— "ప్రతివాదులకులస్థులు వ్యవసాయము, వడ్రంగము, కమసాలపని చేయుదురు." "విశ్వబ్రాహ్మణులు ప్రతిష్ఠ చేయవచ్చునా యని వాదితోను మఱికొందరితోను యోచించి

నాను. చేయవచ్చునని చెప్పినారు." "ఒకటవ ప్రతివాది (విశ్వ బ్రాహ్మణుఁడు) ప్రతిష్ఠచేయునప్పుడు వాది (యీ వైదకి) యున్నాఁడు." 'జానపాటి రంగయ్య వ్రాలు' (అని సంతకము లేదు.)

మఱియు ఉన్నము చినవీరయ్య (కమ్మవారు, జానపాడు) గారి సాక్ష్యము నందలి యంశములను గాంచుఁడు.

"నేను రు. 400-0-0ల సిస్తు కట్టుదును. మాగ్రామములోని పాతపాటమ్మ పోలేరమ్మ గుళ్లను నే నెఱుఁగుదును. నేను 16 సంవత్సరముల వయస్సున నుండఁగా నందిగామ చెన్నమల్లయ్యయను విశ్వబ్రాహ్మణుఁ డీ రెండు దేవతల బ్రతిష్ఠించెను." "ఆ దేవతలకుఁ గుమ్మరియు గొల్లయుఁ బూజారులు" "6 సంవత్సరముల క్రిందట బాతపాటమ్మకు మే మొక గుడికట్టించితిమి. మేము పోలేరమ్మ గుడిని స్థలాంతరమున నేర్పఱచి క్రొత్తవిగ్రహములఁ బ్రతిష్ఠింప జేసితిమి. ఆ విగ్రహములు దుర్గిలో విశ్వబ్రాహ్మణులచేఁ జేయఁబడియె." "పాతపాటమ్మగుడి నా పట్టాభూమిలో నున్నది. ఆ దేవాలయపుఁ బనులను నేను జక్కపెట్టుచునుందును. గ్రామ మున్సిఫు, కరణముకూడ ధర్మకర్తలై యుందురు. మేము 1-వ ప్రతివాదిచేఁ బ్రతిష్ఠ చేయించితిమి. అప్పుడు తగవులేదు. ప్రతిష్ఠ కాలమున వాదికూడ నున్నాఁడు. పురోహితుఁడనని వచ్చె. వస్త్రములు మొదలైనవానిలో నర్థభాగ మడిగెను. 1-వ ప్రతివాది యీయకపోయెను. మేమును, రైతులును భాగమిచ్చుటకు సమ్మతింపలేదు. అటుపైని వివాదము లంకురించెను."

"క్రాసు:-...నాకిప్పుడు 58 సంవత్సరముల వయస్సు. ధాతకఱవునాఁటికి నేను 18 లేక 20 సంవత్సరముల వయస్సు వాఁడను. నేను బందరు గాలివాన యెఱుఁగుదును. మొదట నందిగామ చెన్నమల్లయ్య చేసిన ప్రతిష్ఠ ధాతకు 1, 2 సంవత్సరములు ముందు

గాని, వెనుకఁగాని యైయుండును. అప్పుడు పీటలమీఁద నెవరు కూర్చున్నది నాకు జ్ఞాపకము లేదు. ప్రతిష్ఠాక్రియలు 5 దినములు జరిగెను. ఏ దిన మేమేమి జరిగెనో యా వివరము జ్ఞాపకము లేదు. పాతపాటమ్మగుడి యెప్పుడు నిప్పుడున్న చోటనే యున్నది. పాత పాటమ్మగుడి కాగ్నేయభాగమున మేము సిస్తు చెల్లించుచున్న యూరిభావి కలదు. బియ్యము బట్టలను గుఱించి తగవు వచ్చు వఱకు (నియోగ, వైదిక) బ్రాహ్మణు లందరును కొందఱు విశ్వ బ్రాహ్మణులును నుండిరి. వారి కేమి పదార్థములు వచ్చినది నాకు జ్ఞాపకము లేదు."

"ఆరాధ్యబ్రాహ్మణుఁ డీ యాజనము జరిపినప్పు డెవ్వరేని కంకణము కట్టుకొన్న సంగతి నాకు జ్ఞాపకము లేదు. తరువాత నొక సంవత్సరమునకు విగ్రహములు యంత్రములు లేకయే యుండెను. 1వ ప్రతివాది (ప్రతిష్ఠయొనర్చిన వోలేటి లక్ష్మయ్య) గ్రామము మా గ్రామమునకు 48 మైళ్ళ దూరములో నున్నది. ఆయనకుఁ జుట్టమైన 5వ ప్రతివాది యాయనను బిల్చుకొని వచ్చెను. 1వ ప్రతి వాది ప్రతిష్ఠ చేయుటకుగాను గ్రామస్థుల నెక్కువ సొమ్ము కోరి నప్పుడు తక్కువసొమ్ముకే చేయవలసినదిగా వాది సిఫారసు చేసెను. 9 సంవత్సరముల క్రింద వాదియన్న నామీఁదను మఱికొందఱి మీఁదను క్రిమినల్ కేసొకటి తెచ్చెను. వాది యింటిలోఁగాని ప్రతి వాదుల యిండ్లలోఁగాని యెన్నడును భోజనము చేయవలసినంత యవసరము నాకుఁ గలుగలేదు." ...

ఇంకను పారెల్ల వీరన్న (కుమ్మరి, జానపాడు)గారి వాఙ్మూలమునందలి విషయములుగనుండు.

"నేను గుమ్మరిని నేను బాతపాటమ్మ, పోలేరమ్మల కర్చకుఁడను. వాదియు వాదివంశస్థులు నెప్పుడును మ్రొక్కులు చెల్లించియుండ లేదు."

''(క్రాసు)- వైదిక బ్రాహ్మణులెప్పుడును నన్నము నైవేద్యము పెట్టరు. వారి యిండ్లకుబోయి మేము బియ్యము కూరలు మొదలగునవితీసుకొని తెత్తుము....విశ్వబ్రాహ్మణులును బియ్యము మొదలగు వస్తువులు నైవేద్యములకు గాను మాకిచ్చుట వాడుకయైయున్నది. నేను మొదటిప్రతిష్ఠకుఁ బిలువఁబడితిని.'' (స్వా॥208పు)

''6వ సాక్షి తుమ్మపూడి పకీరు. చాకలి. జానపాడు. ప్రతివాదుల కులస్థులను నేనెఱుఁగుదును. వారియిండ్లలో భోజనము చేయుదును. (క్రాసు):- ''నైవేద్యములలో నాకు భాగముగలదు. మా తండ్రికాలమునుండి మేము ప్రతివాదుల యిండ్లలో దినుచుంటిమి. మేము వెలివేయ బడలేదు. (స్వా॥ 210 పుట)

''7వ సాక్షి తాండ్ర సూరయ్య. వెలమ. కొండూరు.... మానుకొండ గ్రామస్థులొక దేవత ప్రతిష్ఠ చేయించిరి. ఆప్రతిష్ఠను తక్కెళ్ళపాటి వీరేశలింగమను నొక విశ్వబ్రాహ్మణుండు చేసెను. ఆదేవత పేరు లలితాంబ... కొండూరులో రాములవారి పేరుతో నొక ప్రతిష్ఠజరిగినది. దానికి ఒక విశ్వబ్రాహ్మణుఁ డర్చకుఁడయియున్నాఁడు... తూముజయరాము డిక్కడనే యున్నాఁడు. ఆయన వీరేశలింగము ప్రతిష్ఠప్పుడున్నాడు.'' (స్వా॥ 211, 212 పుటలు)

''8వ సాక్షి తూము జయరాముఁడు. మానుకొండ. మా గ్రామములో బాలాంబయను దేవత ప్రతిష్ఠ తక్కెళ్ళపాటి వీరేశలింగమువల్ల జరిగినది. నేను రు. 300 సిస్తు చెల్లింతును. (క్రాసు) ఆవిగ్రహము నీటిలో స్నానము చేయించబడినది. వడ్లు దానిమీద బోసి యారోగింపు చేసినతర్వాత మంత్రములు చెప్పి కొబ్బెరకాయలు కొట్టినతర్వాత గుడిలోస్థాపన చేయబడినది. (స్వా॥214పుట)

---

**N. B.** త్వష్ట్రపుత్రుండును, దేవ పురోహితుండును నయిన విశ్వరూపాచార్యుఁడు మొదలుకొని నేటిదనుక విశ్వకర్మబ్రాహ్మణ పౌరోహిత్యము

"9 వ సాక్షి బొమ్మిరెడ్డి సూర్యనారాయణ రెడ్డి. ముత్యాలంపాడు. మా గ్రామములో విశ్వబ్రాహ్మణులున్నారు. మాకులపు

---

జరుగుచునే యున్నది. ఇంకను గ్రామకరణీకాది యుద్యోగంబులు నిర్దుష్టముగ నిర్వహించగలిగినది సర్వత్రా "వేదచోదితకర్మప్రవిష్టు" లయిన యీ విశ్వకర్మ బ్రాహ్మణులే యని రుజువగుటకు - నీ వాదియే 1909 సంవత్సరమున తన "అభినవసరస్వతి" లో సీరియల్‌గ ప్రకటించిన ప్రాచీన పద్యకావ్యమగు "కరణీకోద్ధారణి" యను గ్రంథమే ప్రబల సాక్ష్య మిచ్చు చున్నది. చూడుండందలి ముఖ్య కథాంశంబులు —

గుంటూరుజిల్లాలోని జానపాడను గ్రామంబునందు ఒక వైదికి శిస్తు చెల్లింపక "ఆవును తెగనమ్మెదనని, రావలసిన దున్నదని, పురంబున నెవరో యీవలెనని టక్కు" లు జేయుచు కాలముఁబుచ్చుచుండినందున నా యూరి కరణమైన విశ్వకర్మబ్రాహ్మణుఁడాతనిని శిక్ష (చావడి) యందుంచగా నదే సమయంబున గోపరాజురామప్రధాని విచ్చేసి కరణముతో నా వైదికిని విడిపింపుమనియు, తన తండ్రియాబ్దికంబున కతనినే నిమంత్రణం బొనర్చితిననియు, నింకనూ నిష్టూర్యముగా నారామప్రధాని ఎట్లుపలుకుచున్నాఁడో గ్రహింపుఁడు.

"కం. వేదచోదిత కర్మప్రవిష్టుఁడవయి, హవ్యకవ్యంబులన్నియు నాచరించు,
వాఁడవై యుండియుదియనివార్యమనుచు, చెలియలేవైతివిదిమంచి తెలివిగాదె"

అనేకాబద్ధంబులు చెప్పుచు తరాయించు నా వైదికినుండి సిస్తువసూలుచేసి 'దాని భూజానికనుపవలసిన కరణమునకు తోడ్పడవలసిన మంత్రి - ఆ నిర్దుష్టచర్యకు అపార్థము కల్పించి - ఎట్లో తన కార్యము నెరవేర్చుకొని చని ప్రభుసన్నిధిం జేరి చెప్పురీతిగ నుండు.

'క. మాటలయనుపురి, నొక్క కళాదుఁడు కరణీకవృత్తియందు సమగ్ర,
శ్రీదనరియుండు గర్వ ప్రాదుర్భావమున దనకు ప్రభువడనుచున్.' (123)

ఆ కరణము ప్రభుదిక్కారమొనర్చె నని నేరమారోపింప గల్గినాడు. అట్టి వారిపై "నీ పటుతర ఉద్యోగభార మునుప" రాదనియు నింకను వారిప్రశస్తిం జెప్పుట తిలకింపుడు.

ఉ. సర్వము వారిచేనగుట సత్యముగావున దాననే సమ,
స్తోర్వియుఁ జిక్కిపిక్కటిలుచున్నది యాపయి గ్రామణిత్వమున్,
దుర్వహమైన యీ పనియుఁదోడగుటన్ వివరింపనేల యీ
యుర్వికఁ నిర్వహించదని యోజన తోచె నరేంద్రచంద్రమా" (127)

రెడ్లు వాండ్ర యిండ్లలో భోజనము చేతురుగాని వాండ్రు మా

---

సీ॥ ఉర్వీతలంబెల్ల నొకత్రాటఁ గొలిపింప, భూస్వభావంబెల్లఁ బొందుపరుప,
దరములుగల్పించి ధనమునిర్దేశింప, జమఁజేసిదాని భూజానికనుప ......

గీ॥ ప్రాతిపదికయ యిది భూమిపాలునకును, దీనిచేగాని నృపతికిఁ జేటపడదు,
ఘనతరోద్యోగమైన యీకరిణికంబు, గలుగ వీరలఁబట్టు పగ్గాలుగలవె" 128

అని యిట్లు లా విశ్వకర్మబ్రాహ్మణుల యున్నతోన్నతిం దెల్పి సర్వావనిం గల వారికరణికోద్యోగాపహార 'శాంతఃకరణంబుఁ దెలిపిన నమ్మహీవల్లభుండు' తగదని చెప్పుటయు నిక్రిందం గాంచుడు.

క॥ ఒకదుర్మార్గునికొరకై, ప్రకటిత బహుజీవనములబాపుట యిదియే,
మికడంకయునిన నానృప, మకరాంకునితోడ మంత్రిమండనుఁడనియెన్ 131

మ॥ కృతవీర్యాత్మ సుతాపరాధమున నక్షీణోగ్రతన్ రేఁకా, సుతుఁడక్షత్ర
ముగాఁగ శాపవరవిస్ఫూర్తిన్ ధరిత్రిన్ మఱో, పృథులా రాజలనెల్లజంపి వసుధా
దానంబుచేబ్రాహ్మణ ప్రతతిన్ సంతసమందజేయఁడె నిజప్రావీణ్యమేపారఁగన్ 132

మంత్రి యిట్లెంత సాహసోపేత దుర్బోధ లొనరించినను రాజందులకు నంగీకరించినట్లు లేదు. అందుచే నా చక్రవర్తిని సయితము మోసగించి దాన నెపంబున నేడుగడియలు రాజముద్రికం బడసి యా కాలపరిమితిలో నాయవేల గ్రామముల విశ్వకర్మబ్రాహ్మణుల కరణీకోద్యోగంబులు తనకులమువారి వశం బగునట్లు మొహరు వేయంగలెను. ఇందుంగూర్చి కృష్ణాడిస్ట్రిక్టు మ్యాన్యూయల్ 324 P. చాప్టర్ XI. నం గల అంశంబిట నుదాహృతము.

"కృష్ణాడిస్ట్రిక్టులో కరణములందరు సామాన్యముగా నిప్పుడు నియోగ బ్రాహ్మణులే అయ్యున్నారు. కడపా, నెల్లూరు, గోదావరి జిల్లాలలోను యిదే మాదిరిగనే యున్నారు, ... 1144 సం॥ అక్టోబరు నెలలో సూర్యగ్రహణ స్నానసమయమున తన దివానుఅగు నియోగబ్రాహ్మణుఁడు యెదురుపడి యొక దానము నడిగెననియు, అందుమీదట రాజు 7 గంటల వరకు తన రాష్ట్రము పైని యధికారము చెలామణి చేయవచ్చు ననిన దానఅధికారము నొసంగినట్లును అందుమీదట సమయము కనిపెట్టి ప్రతిగ్రామముయొక్క కరిణీకము తనకుల నియోగిబ్రాహ్మణుడే యగునట్లు నియమించె ననియు తాను సొంతముగా నా పనిని నెరవేర్చుటకు పూర్వమే 7 గంటలకాలము సమాప్తమైనందున కొన్ని గ్రామములు మిగిలిపోయిన వనియు ... చెప్పంబడి యున్నది. (విపుల విషయ మెరుంగ గోరువారు "కరిణీకతంత్రము" అను గ్రంథమును వీక్షించెదరుగాక).

యిండ్లలో భోజనము చేయరు. మాయూరిలో బొడ్రాయి యను దేవతను సుమారు 10 యేండ్లక్రిందట బెజ్జంకి రామాచార్యులను విశ్వబ్రాహ్మణునిచే బ్రతిష్ఠచేయబడినది. (క్రాసు) మొదటిప్రతిష్ఠ వలన 9–10 సంవత్సరములు మాత్రమే దేవతకు మహాత్మ్యముండును గావున రెండవ ప్రతిష్ఠ చేయవలసి వచ్చినది ... బెజ్జంకి రామాచార్యులది రాజమహేంద్రవరము. నేను నా కులములోనే వున్నాను.'' (215 పుట)

''10వ సాక్షి బండారుసిద్దప్ప....గొల్ల....తుమ్మకుంట...
మేము విశ్వబ్రాహ్మణుల యిండ్లలో భోజనము చేతుము. మా కులపురోహితుడు వారియిండ్లలో భోజనము చేతురు. (క్రాసు) మా గురువు విశ్వబ్రాహ్మణుడు. నిజమైనబ్రాహ్మణులు విశ్వబ్రాహ్మణులే.... గ్రామదేవతకు వైశ్యులు కరణములును బోనములు పెత్తురు. విశ్వబ్రాహ్మణులు కూడ బోనములు తీసికొనివత్తురు. నైవేద్యము మాకిచ్చిన మేము తినెదము. (స్వా॥ 217 పుట)

''11వ సాక్షి తక్కెళ్ళపాటి వేశేశలింగాచార్యులు తక్కెళ్ళపాడు.... నేను దేవాలయములు విగ్రహములు ప్రతిష్ఠలు చేయుదును. విగ్రహము పూర్తియైనపిదప బ్రతిష్ఠచేయుటకు బూర్వము ద్వాదశ సంస్కారములు చేతుము. ప్రతిష్ఠ చేయునది శిల్పబ్రాహ్మణుడే. (క్రాసు)– రావినూతల, చీమకుర్తి, యద్దనపూడిలలోను... బ్రతిష్ఠలు చేసినాను. పెదగొట్టిపాటిలో నేను శివప్రతిష్ఠ చేసినాను. ఈదుమూడిలోను మా గ్రామములోను విష్ణుప్రతిష్ఠ చేసినాను. రావినూతలలోగూడ విష్ణుప్రతిష్ఠ చేసినాను. కుఱ్ఱనారపాలెములోను మాగ్రామములోను బోలేరమ్మ ప్రతిష్ఠచేసినాను. నూనుకొండలో

---

వంశపరంపర విశ్వకర్మబ్రాహ్మణ కరణములే గల నెల్లూరుజిల్లా, వెంకటగిరి తాలూకాలోని బచ్చలకూరపాడు, చిన్నారికట్ల, పెద్దారికట్ల, నాయుడు

లలితాంబ ప్రతిష్ఠచేసినాను. పూసూరుంలోఁ జింతలమ్మ యంకమ్మల ప్రతిష్ఠలు చేసినాను. పోతారలంకలోఁ బోతరాజు ప్రతిష్ఠ చేసినాను మము నెప్పుడును బ్రాహ్మణులనియే పిలుతురు. బజారులోఁ దెలియనివాండ్రు మాత్రము విశ్వబ్రాహ్మణులని పిలుతురు. నేనిదివరకు కమసాలియను (కులము) పేరు వినలేదు. (స్వా॥ 217 మొ॥ 221 పుట)

"12వ సాక్షి బొర్గవరపుఁ బెదయచ్చయ్య. విలేజి మున్సిఫ్. జానపాడు. మాగ్రామములోఁ బాతపాటమ్మ, పోలేరమ్మ గుళ్లున్నవి. 40 సంవత్సరముల క్రిందట చెన్నమల్లయ్య యను విశ్వబ్రాహ్మణునిచేఁ బ్రతిష్ఠ చేయఁబడెను. రెండుగుళ్ళలో స్థాపనకు మాయన్న కంకణము కట్టుకొనెను. చివరి ప్రతిష్ఠకు 1 వ ప్రతివాదిని పిలిపించినాము. ప్రతిష్ఠయైనతర్వాత బియ్యము, పప్పు, గుడ్డలు పంచుకొనుటలోఁ గలహము జరిగెను. వాదియును 1 వ ప్రతివాదియు వివాదపడిరి. (క్రాసు) మొదటి ప్రతిష్ఠ ధాతసంవత్సరమునకుఁ బూర్వమై యుండును. అప్పుడు ప్రతిష్ఠ చేసినది జానపాటి గ్రామస్థుఁడు. అతఁడు మాగ్రామములో ప్రతిష్ఠయేగాని పౌరోహిత్యము చేయఁడు... ఆరాధ్యుడు చేసిన ప్రతిష్ఠ చెడిపోయినందువలన మరల విశ్వబ్రాహ్మణుని బిలువవలసి వచ్చినది. వైదికబ్రాహ్మణులు ప్రతిష్ఠప్పుడేమియు జోక్యము కలిగించుకొనలేదు. మావలె వారుకూడ నక్కడనే యుండి భాగము కావలెనని కోరినారు. అందుకు మేమాటంకపరచినాము. వాది పౌరోహిత్యము చేయడు. ఏజంట్ల

---

పేట, గుట్లగట్టు, ఇరసలగుండము, యాచభూపాలము, కొల్లంపల్లి, సామంతపూడి, నాగంపల్లి, వింజవుర్తి, చినమనగుండము, రాపూరు తాలూకా, పల్లికొండ, ఆత్మకూరు తాలూకా, కాకివాయి మొదలైన గ్రామములయందు — కరణీకోద్యోగనిర్వహణముసేగాక వైద్యము, భూతవైద్యము, జ్యోతిష్యము, శిల్పాద్యనేక వృత్తులు చేసహితాభ్యున్నతి కగు "సర్వమువారిచే నగుట సత్యము" అను నుడి కొంతవఱకు సార్థక మగుచునే యున్నది.

ద్వారమున జరుపును. నేను విశ్వబ్రాహ్మణుల యిండ్లలోగాని వైదికులయిండ్లలోగాని భోజనము చేయను.'' (స్వా॥ 222, 225 పు)

13 వ సాక్షి గుండాల ముత్తయ్య. (కమ్మవారు) జానపాడు. ''పాతపాటమ్మ పోలేరమ్మ గుళ్లో నేనెఱుఁగుదును. దాని ప్రతిష్ఠప్పుడు నేనున్నాను. ప్రతిష్ఠయైన తర్వాత వైదిక బ్రాహ్మణులకు విశ్వబ్రాహ్మణులకుఁ దగవువచ్చెను. కరణముగారు, కమ్మవారు విశ్వబ్రాహ్మణుల పక్షమున సహాయముగ వచ్చినారు. తగవు బియ్యమునకు, గుడ్డలకును. వైదికులు బియ్యము, గుడ్డలలో భాగము కావలెనన్నారు. (క్రాసు)— ''నేను గుళ్ళమ్మకుఁ బనులు చేయింతును. వాదియన్నకు నాకు స్నేహము.'' (స్వా॥ 226పుట)

14 వ సాక్షి సల్లూరి నాగయ్య. (కమ్మవారు) గారపాడు... ''మా గ్రామములో విశ్వబ్రాహ్మణులు గంగాధరస్వామి గుడిలో

---

N. B. అప్పుడును, ఇప్పుడును శిల్పాచార్య ప్రశస్తిం గూర్చి శ్రీ॥ శ్రీ॥ గోనుగుంట పున్నయ్యగారు రచించిన ''కళాతపస్వి'' యను బద్యకావ్యము నందలి రెండుపద్యంబు లుదాహరింతును.

సీ. రాజరాజకిరీట రత్నప్రభారాశి, నా పాద నీరాజనమున వెలిఁగ,
దుర్వార వాహిని తోయంబు నా యానఁ గురుబిడ్డల పగుబాలుఁ గొని !
నిష్ప్రయోజక శిలానిచయంబునను దాకి వేద వేద్యాకారఁగ వేద్యమయ్యె !
సర్వంసహా గవిస్తనము చేపొదలించు, వత్సమైనిల్చె నా వాస్తువిద్య.
గీ. లోకకళ్యాణ మస్త్రదా లోకనంబు, సృష్టివర్గక మస్త్రదాశీర్వచస్సు.
విశ్వకృల్లీలనా కళావిలసనంబు, శైల్పికతపస్వి కెవ్వఁడు సాటి చూప.

సీ. స్నానసంధ్యానుష్ఠానంబు లొనరించి, త్వష్టృ దేవధ్యాన తత్పరుఁడయి,
ఛాత్రసమానీత సవనోపకరణమూ, శిల్పదీక్షాంక వేట జేరవిడిచి,
వాగీశ్వరీహోమ పావకజ్వాలలో, స్వర్ణధాతుహవిస్సుగాఁ దలంచి,
టంకంబుతో మేరువోంకార మొనరింప, శిల్పోపనిగమ వాక్స్ఫురణము,
గీ. నవవధూవర జీవితానంద విజయ, కల్పనా కల్ప సంకల్ప కవినుఁడగుచు,
యాయజూకుఁడు మాంగల్యమదె సృజించు నపుడు నిపుడును లోకకళ్యాణముసగ.

నభిషేకము చేయుదురు. వైదికులుకూడఁ జేయుదురు. నేను విశ్వ బ్రాహ్మణుల యిండ్లలో భోజనము చేయుదును. నేను వారి యిండ్లలో 40 సంవత్సరములనుండి భోజనము చేయుదును.''

''గంగాధరస్వామి యర్చకుఁడు తంబళివాఁడు. ప్రతిసంవత్సరము కార్తికమాసములోఁ గొమ్మూరి పిచ్చావధానులు అభిషేకము చేయఁగా జూచినాను.'' సల్లూరి నాగయ్య నిశాసి. (స్వ 227 పు)

''15 వ సాక్షి మువ్వా పాపారాయఁడు (కమ్మవారు) తాడిపట్టు....మాగ్రామములో విశ్వబ్రాహ్మణులు బ్రహ్మేశ్వరలింగమును స్థాపన చేసినారు. ప్రాతలింగము స్థానభ్రష్టమైనందున విశ్వబ్రాహ్మణులు తిరిగి ప్రతిష్ఠ చేసినారు....నేను విశ్వబ్రాహ్మణుల యిండ్లలో భోజనము చేయుదును. రు 50–0–0 లు సిస్తు చెల్లింతును. (క్రాసు) నేను గర్మలు చేయించుటకు సంస్కృతము, మంత్రములు నేర్చుకొనుచున్నాను. (స్వా॥ 229 పుట)

''16 వ సాక్షి పోచంపల్లి బసవయ్య. మంగలి. గుంటూరు... ప్రతివాదులు విశ్వకర్మలనియు, విశ్వబ్రహ్మలనియు, విశ్వబ్రాహ్మణులనియు పిలువంబడుదురు. ఆముగ్గురు నొక్కటే తెగవారు. నేను విశ్వబ్రాహ్మణుల యిండ్లలో భోజనము చేయుదును. (క్రాసు)— వైదికుల యిండ్లలో భోజనముచేయను.'' (స్వా॥ 230 పుట)

17 వ సాక్షి మందపాటి పరశురాముఁడు. మాదిగ. గుంటూరు. ''నేను విశ్వబ్రాహ్మణుల నెఱుగుదును. వారి యిండ్లలో భోజనము చేయుదును. వైదికులయిండ్లలో భోజనము చేయను. మాకులపువాండ్రు విశ్వబ్రాహ్మణులేబ్రాహ్మణులని ఎంతురు. (క్రాసు) విశ్వబ్రాహ్మణులు మాగురువులు. మాపెద్దలు యావత్ప్రపంచమునకును విశ్వబ్రహ్మలే సృష్టికర్తలని చెప్పినందున నేను అసలైన బ్రాహ్మణులుగా నెంచితిని. (స్వా॥ 230)

ఇట్లు సాక్షులవిచారణ పంద్రెండు రోజులు జరిగిన తర్వాత సభ యులకును మధ్యవర్తిగ నొకపండితునినిర్ణయింప నా న్యాయాధికారి తలంచినటు లీక్రిందిపద్యములం గలదు.

క॥ ఈరీతి భయసాక్షుల, నాతార్పం ద్రెండు దినము లామున్సిఫ్ గార్,
కోరి విచారణ యొనరిచి చీరి యుభయవాదులను వచించెను నిట్టుల్ (362)

క॥ కోరుకొనుఁ డేవని నేనియు మీరని వచియించుటయును మేమంటిమి మా
పాలులుదప్పమటొక్కరు, నేమతు రే శ్రుతులలో నిజమెఱుఁగుటకున్ (363)

ఎట్టకేలకు కారంపూడి 'రాజమన్నార'ను చీరాలవాస్తవ్యుఁ డగు నొక పండితునిఁ దానుకూడ నెన్నుకొనియె తర్వాత నాలిసం గూర్చి యేమి వ్రాయుచున్నాఁడో చూతుఁము.

ఆ॥ సంస్కృతాంధ్రములను సాహిత్యమొకరీతి, నున్నవాఁడెయాతఁడుండుగాక
అంతమాత్రముననె యఖిలశ్రుతిస్మృతు,లవగతంబులెట్టులగును దలప. (371)

క॥ గురుముఖమునె తెలుగన్వలె, మతిశాస్త్రజ్ఞానశూన్య మానవులది, యా
గురువులు ద్విజులకుదప్పన్, సరిగన్ బోధింపరెంత సచ్ఛూద్రులకున్. (373)

క॥ కాన శ్రుతిస్మృతు లెయ్యెడ, నేని పఠింపంగఁజనద యిల శూద్రులకున్
మానములున్నవి పెక్కులు, కానంబడ రెపుడు నవ్వి కటుచినశూద్రుల్. (375)

క॥ కాబట్టి రాజమన్నార్. సేబాసన నింత కైత సెప్పినమాత్రన్,
తాబుద్ధిచొను పగలఁ డొకొ,యాబాడబవేద్యమైనయామ్నాయమునన్ (376)

తే॥ బ్రాహ్మణేతరులను బెద్దపండితులగు, వారలున్నారలనిపించు వాంఛదగిలి
రాజమన్నారుకవిగారిరాకగూర్చి,సమ్మతించెను మున్సిభు చాలనపుడు(380)

న్యాయాధికారిసైతము పక్షపాతి యన సాహసించి చెప్పఁ జూచుచున్నాఁడు. కాంచుడు.

క॥ మునిసీఫుగారుమాత్రము, ఘనప్రశ్నములేవొ యడగి కడుసంతసమం
దినవాఁడు తనకుఁదామది,పనివడి పిలిపించినపుడు పాడియె యదియున్ (383)

పబ్లికు కోర్టులో డిస్ట్రిక్టుమున్సిఫుగారు రాజమన్నారుకవిని ఘనప్రశ్నములడిగి నట్లును, అతఁడు సంతసముగొలుపునట్లు సమాధానము లిడినట్లును దెలియంగల్గినది. కాని ఆ యా ఘనప్రశ్నం

బులుకాని సంతసముంగొలుపు నారాజమన్నారు కవియొక్క వాఙ్మూలము ప్రచురింపగల్గినచో నెంతయైన బాగుగానుండెడిది.



బ్రహ్మశ్రీ కీ॥ వెల్లటూరి శేషావధానులు గారు ప్రతివాదులపక్షమున మేజస్ట్రేటు కోర్టులో సాక్ష్యమిచ్చియున్నట్లు (స్వ॥ వ్య॥ 39 వ పుట) గనంబడును. కాని దానినికూడ నీతఁడు ప్రచురింపజాలక పోవుట గల్గియున్నది. ఇందుకుంగల కారణం బూహింప దగినది యైయున్నది. శ్రీ అడిషనల్ డిష్ట్రిక్టు మున్సిఫు గారు విచారణానంతరము హేంరింగొన రించి మూడుమాసముల వాయిదా లోపల వ్రాసియున్న తీర్మానము నీ క్రింది పద్యములో నాక్షేపించినాడు. చూ.

కం. మాసత్రయంబు దనుకఁ జేసిమదిఁ యోజనంబు సిద్ధాంతితమై,
భాసిలు స్వాభిప్రాయము వ్రాసెఁ మునిసీభుగారు వరుసఁ గనుడీ.
(స్వ. చ. 2.)

ఆతీర్పునందలి వరుసక్రమ ముఖ్యాంశంబుల నిట నుదాహరించు చున్నాను. పాఠకులు చక్కఁగ పరికించెదరు గాక.

---

పరా:. “గుంటూరడిషనల్ డిష్ట్రిక్టు మున్సీఫు కోర్టులో మహారాజరాజ శ్రీ కనకపల్లి రంగనాయకులు నాయఁడుగారు బి. ఏ., బి. యల్. అడిషనల్ డిష్ట్రిక్టు మున్సీఫు - 1912 సంవత్సరము మార్చి 30 వ తేది శనివారం — అ॥ నెం 26 ది 1911

వాది - జాసపాటి పట్టాభిరామశాస్త్రి ప్రతివాదులు 1 లోశేటి లక్ష్మయ్య, 2 నందిగామ కాశీపతి, 3 సిరిపురపు భిక్షాపతి, 4 నందిగామ చినబ్రహ్మము, 5 జుజ్జూరి మల్లయ్య.

"వాది పక్షమున 14 మందియుఁ బ్రతివాదుల పక్షమున 17 మందియు విచారింపఁ బడిరి. విచారింపఁబడిన యంశముల రుజువుకై సంస్కృత గ్రంథములు ప్రమాణములుగానీయంబడినవి."

"బ్రాహ్మణశబ్దము యాజనమే వృత్తిగాఁ గలవారిని దెలియఁజేయునని పార్టీలొప్పుకొను చున్నారు. బ్రాహ్మణశబ్ద మెవరియందు సార్థకమగునో యది తెల్పుటమాత్రము కష్టము. మనుధర్మ శాస్త్రములో బ్రాహ్మణేతరుల కెవరికిని యాజనాధికారము లేదని చెప్పంబడి యున్నది. తాను బ్రాహ్మణుఁడ ననియుఁ బ్రతివాదులు కారనియుఁ ♦ జెప్పుచున్నాఁడు. (ప్రతివాదులున్నూ అట్లే చెప్పుచూ వాది బ్రాహ్మణుఁడు కాడని వాదించు చున్నారు.) ప్రతిపాధికారము గలవారని శాస్త్రములలోఁ జెప్పఁబడిన బ్రాహ్మణులెవరని చెప్పవలెను?"

---

1912 సం॥ 20 వ ఫిబ్రవరి మంగళవారమున వాదితరఫు ప్లీడరులగు మహారాజశ్రీ రంగాచర్యుల హనుమయ్య, కాకాని పుండరీకాక్షుఁడు గార్ల యొక్కయు, 2, 3, 4, 5 ప్రతివాదుల ప్లీడరులగు ఉన్నవ లక్ష్మీనారాయణ, వి. అంకమ్మనాయఁడు, జే. డి. సామియల్ గార్ల యొక్కయు సమక్షమున నీ దావా హియరింగునకు రాఁబడుటయు నది మొదలుకొని యాలోచన నిమిత్తముంచి యీ రోజునఁ దీర్పుచెప్పబడినది. వ్యవహారమధ్యమున 1 వ ప్రతివాది చచ్చిపోయినాఁడు." (స్వ॥ వ్య॥ 239 పుట)

♦ షరా:— ఆదిబ్రాహ్మణశ్రేణిని - అనఁగా - సానగాది బ్రహ్మర్షిగోత్రజులైయున్న ప్రతివాదుల సంఘమునంతటిని - "హరిత" విశ్వామిత్రాది పలు జాతి ఋషుల గోత్రజులైయున్న వాదియు వాదికులమువారొక కొందరును తమ పాండిత్యముఁ బ్రద్దలుచేసికొననో యన తమ తమ సంకరవాదముచే ప్రతివాదుల కించపరుప నెంచుట గర్హనీయము. అందుచే ప్రతివాదుల సంబంధులగు బ్రహ్మశ్రీ వదాన్య రామలింగకవికృత "విశ్వప్రకాశమండలము" అను శతకమునందలి పద్యంబుల నొకకొంత సంస్కరణతో నిట నుదాహరించు చున్నాను - మా॥

"మనుష్యుఁడు తాను వ్యవహరింపబడు దానినిబట్టికాక తన నిజస్థితినిబట్టి విచారింపబడవలసి యుండును. కావున వాది సామాన్యముగా బ్రాహ్మణుఁడుగా వ్యవహరింపబడినను వాస్తవమునకుఁ గాఁడని చెప్పుచు 'బీటర'ని పిలువంబడువాఁడు మొదట 'జాను' అను పేరుగల వాఁడైనను దాను జెప్పుకొను దానినిబట్టి లోక మతనిని పిలువక తప్పదని దృష్టాంతప్రదర్శనపురస్సరంబుగ ప్రతివాదులు వాదించుచున్నారు."

"వివాద పర్యవసాన మేమన? మనుస్మృతిలోఁ జెప్పఁబడిన బ్రాహ్మణుఁడు బ్రాహ్మణ కులములో జాతిమాత్రుఁడేనా? లేక

---

సీ॥ బ్రహ్మముఖోద్భవ బ్రాహ్మణద్వేషులై దూరదృష్టివిడి తూలనాడి
పంచాస్యగోత్రులన్ పలుజాతిగోత్రులే తెలివిమాలి మదించి తిట్టనేల?
వారిపూర్వులజాడ వారెంచుకశాస్త్ర వైరుధ్యముగ నేమి మొరిగినారు
అంతటి స్వార్థులై నావ్యాసుఁడైనను పంచములనిమునుఁ బలుకగలఁడె?
గీ॥ నోరు క్రొవ్వియు మనుజులన్ నొవ్వబలికి, ప్రతిభ గాంతురె తగుప్రతిఫలము
గాక, తిట్టుటకు తిట్టు, రట్టుకు రట్టుగలదు శాశ్వతపదాఖిలేశ విశ్వప్రకాశ.
సీ॥ హీనకులుండౌట తానుగర్వించెను, సహజంబె వానికాశ్చర్యయేమి?
బ్రహ్మసంతతికి దుర్భ్రమలేదు వైర, భావములేదు క్రూరభావంబులేదు
ఫలితాంశముగ్రహించి ప్రబలుచుందురుగాని దీనత్వముసహించి తిరుగరెపుడు
భిక్షమెత్తుటలేక; పీడించుటయులేదు, పరులనిందించు సంబరములేదు
గీ॥ సకలసంపదలిచ్చు లోకసర్వసృష్టి, పంచవృత్తుల మిశ్రితస్వభావమలరి,
వేదశిల్పాదిశాస్త్రప్రదాతలగుట, శాశ్వతపదాఖిలేశ విశ్వప్రకాశ.
సీ॥ విశ్వకర్మయు మేము వేరువేరేనట, మాదిగల్ తమ మేనమామలునట
పంచవృత్తులునెల్ల బానిసపనులట, దండిభిక్షువృత్తి తమరిదియట
తగభోక్తలకాకపో తక్కువమేమట మెక్కిన దామెల్ల రెక్కువయట
బ్రహ్మసంతతిమేము పంచమజాతిట తాముశ్వపాకిసంతానమెయట
గీ॥ తమకు దాయాది యూర్వశితల్లియౌనట, వారికున్మాదబుద్ధియె వైదికమట
తెలివిలేదట తెలిసిన తెలుపరయట, శాశ్వతపదాఖిలేశ విశ్వప్రకాశ.
గీ॥ ఇంతటి యసూయ పాలుల కేలనన్న, నాదిపౌరోహితులము మేమగుటవలన
దొంగలకుఁ ద్వేషముండదే దొరలపైన, శాశ్వతపదాఖిలేశ విశ్వప్రకాశ."

బ్రాహ్మణుఁడు చేయవలసిన కర్మలకుండవలసిన గుణములు కలిగి యున్నవాఁడా? యనునది.''

''ఈ హేతువులనుబట్టి బ్రాహ్మణశబ్దము గుణవద్వాచకముగాని జాతివాచకము కానేరదు. బ్రాహ్మణత్వ వ్యవహారమాత్రము బ్రాహ్మణశబ్దము సార్థకము కానేరదు. ఈ ప్రకారము మతసంబంధ కార్యముల నెరవేర్చుట కుండవలసిన గుణములును, మతవిషయమగు నధికారమును నొకపర్యాయమే యేర్పరచిన యడల నట్టి యోగ్యతలు గలిగిన మనుష్యులను బ్రాహ్మణులని పిలిచినట్లుగానే విశ్వబ్రాహ్మణులని ... పిలిచినను బిలువవచ్చును. గులాబిపువ్వు నేపేరుచే వాడినను వాడవచ్చును గాని యది యట్టి సువాసన మాత్రము కలిగియుండ వలయును.''

డిష్ట్రిక్టుమున్సిఫుగారు బ్రాహ్మణత్వ వివరమునుగూర్చి తీర్పులో పై వాసనావాసనావిశేషపు హెచ్చరిక నొనర్చియుండుటచే వాదియైన వైదికి తమజాతివారా జాతీయవాసనకుకూడ దూరులే యైయున్నట్లు గ్రహించి కాబోలును ఈక్రింది పద్యమున తన కులమువారికెట్లు బుద్ధిచెప్పుకొనుచున్నాఁడో చూడుఁడు.

ఆ. మునిసిభనినలాగ మన కవస్యం భావ్యమైనయట్టి శీలమువల ద్రోచి
'మేముబ్రాహ్మణులము మేముబ్రాహ్మణుల'మంచెగురులాట కరముతగనిచేత (76.)

ఇంకను తీర్పునం గల్గియున్న ముఖ్యాంశములు గాంచుఁడు:-

"వాది తరఫు 2వ సాక్షి (శిష్ట్లా సీతారామశాస్త్రిగారు) సామాన్యముగా గమసాలురని యెంచబడు ప్రతివాదికులస్థులు యెగ్జిబిటు యాజ్ఞవల్క్య స్మృతిలో బేర్కొనఁ బడిన (అవాంతర) రథకార జాతివారని చెప్పుటకుఁ బ్రమాణ మేమియు లేదని చెప్పెడిని. ఆయన సాక్ష్యములోని సంగతులు శాస్త్రప్రమాణము లని చెప్పుటకు వీలుగానున్నవి.''

"విశ్వకర్మ కుమారుఁడు త్వష్టయను పేరుగలవాఁడనియు, నాదిమూర్తిగాక మఱియొక విశ్వకర్మయున్నాఁడనియు నతఁడు (ప్రతివాదుల మూలపురుషుఁడై) యుండవచ్చుననియుం జెప్పుచున్నాఁడు."

"తుచ్ఛవంశజులైన ఋషులు వాదికిని వాదికులము వారికిని ప్రవరులై యున్నమాత్రమున వారిని సంకరులుగాఁ చేయఁజాలరు. ఆఋషులు పారమార్థిక ఘనత గలవారగుటవలన వారిని స్వగోత్ర ప్రవరులుగా నవలంబించిరో లేక తత్సంతతివారే వీరగుదురో తెలియదు."

"ఉభయవాదులకు మధ్యవర్తిగాఁ బిలిపింపఁబడిన "కారెంపూడి రాజమన్నారుగారు పూజనీయులైన యర్చారూపములు శాక్తములు, దైవ్యములు, పైశాచకములు మానవములు నని నాలుగు విధములనియు, మనుష్యులకు మానవములతో సంబంధమనియు నవి యభిమానసులు, సామాన్యములు, ప్రకృతములని తిరిగి మూడువిధములుగా విభజింపం బడెననియు, సామాన్యులచే స్థాపన చేయించబడునవి సామాన్యవిగ్రహములనియు, నపాయపుదినములలో స్థాపన చేయఁబడునవి ప్రకృతవిగ్రహములనియుఁ బ్రకృతములు జనులను రోగములద్వారమున బాధించుచు బలులను గోరునవియగుట నీచదేవత లనియుఁ జెప్పుచు 'పంచప్రశ్నాగమ'మను గ్రంథమును గోరుకొనెను. కాని యుభయవాదులునుఁ దానిని దేలేకపోయిరి." 'శేషధర్మము' 76వ పుటలో శూద్రుఁడర్చకుఁడుగాఁ గలిగినటువంటి శివునిగాని, విష్ణునిగాని పూజచేసిన బ్రాహ్మణునకు ముక్తి లేదని చెప్పఁబడినది" యని రూపింపగలైను.

"బ్రాహ్మణు లెప్పుడును భగవంతుని ప్రక్కనుండి భక్తులాం భగవంతుని దయకుఁ బాత్రులగులాగు సిఫారసు చేయుటకుఁగల

పవిత్రత యెట్టిదైనను గార్గేయాగమములో విగ్రహములు చేయుట మొదలుకొని గుళ్లలో స్థాపన చేయునంతవఱకు కడుపులోఁ బిండ మెన్నివిధములుగా మాఱునో యన్నిదశలీవిగ్రహముకూడ ననుభవించవలసి యుండునని చెప్పబడినందున బ్రతిష్ఠప్పుడు మాన్యస్థానార్హుఁడు శిల్పాచార్యుఁడని చెప్పఁబడినట్లును నెపుడును విడనాడకుండ నుండవలసివచ్చి యతఁడులేకుండ గడుపుకొనుటకు వీలులేనట్లును గనంబడెడిని. ప్రతివాదుల సాక్ష్యములోఁ జెప్పఁబడిన ప్రతిష్ఠలు చేయంబడినచోట్ల ప్రతిష్ఠాసంబంధములోఁ బ్రతివాదులకుఁగల యధికారమును స్థిరపరచును. ఎల్లవిగ్రహములను ప్రతిష్ఠచేయుటకు హక్కు కలిగినవారు శిల్పాచార్యులేనా యను విషయమునుగుఱించి నాయొక్క నిశ్చితాభిప్రాయము నీయ నక్కఱలేదు.''

"వాది బ్రాహ్మణుడనని వాదించుచున్నాఁడు నిర్ణయసింధువులో శూద్రుఁ డర్చకుఁడుగ గలిగినటువంటి విగ్రహములను బ్రాహ్మణులు పూజించిన నరకమును బొందుదురని చెప్పఁబడి యున్నది. వాది యటువంటి నరకమును కోరుకొనక పోవచ్చును."

"ప్రస్తుత దేవతలు శివుడుగాని విష్ణువుగాని యయిన నా యుద్దేశ్య మెలాగున్నప్పటికిఁ బోలేరమ్మ పాతపాటమ్మ మొదలగు గ్రామదేవతల ప్రతిష్ఠ వాదియు వాదికులము వారును మాత్రమే చేయవలెనని లేదని నేను జెప్పవచ్చును కనుక మొదటిసారాంశము వాదికననుకూలముగాఁ దేలినది.

"2వ సారాంశము— మొదటి సారాంశములో వాడుకను బట్టియు గార్గేయాగమమును బట్టియుఁ బ్రతివాది కులమువారికిఁ బ్రతిష్ఠాసమయములో నెక్కువముఖ్యమైన భాగముండుటను బట్టియుఁ బ్రకృతదేవతలుగాక యింకొక యెక్కువదేవుఁడైనప్పటికి మైలపడనేరఁడు. కనుక యీదావాదేవతల విషయమై చెప్ప

నవసరము లేదు. అవి మైల పడనే లేదు. రెండవ సారాంసము కూడ వాది కననుకూలముగ నే తీర్మానించితిని.''

''3వ సారాంశము- వాది నష్టమెట్లడుగుచున్నాఁడో నాకుఁ దెలియుట లేదు. గ్రామ దేవతలను బూజచేయుట కర్తవ్యతయున్నదని యనుకొన్నప్పటికి సహస్రసంఖ్యాక జనులలో వాదియు నొకఁడు. దావా బ్రాహ్మణసంఘుపక్షమునఁ దీసికొని వచ్చినవాఁడు కాఁడు. సంఘుపక్షమునఁ దీసికొనివచ్చి తరువాతఁ దానొక్కఁడే దావా నడిపినాఁడు. ద్విజసంఘుము తరఫున దావా నడుపుట కుత్తరు విచ్చి నట్లు యెంచినప్పటికి లెక్కకెక్కువయిన ముఖ్యసంఘుమును వదలి పెట్టినాఁడు. పూజచేయువారిలో నధికసంఖ్యాకులు శూద్రజాతిలో నుండిరి. వారిపక్షమునఁగూడ నేజంటుగా నుండుట కేర్పరచు కోలేదు. ఆప్రతిష్ఠకు వారు తృప్తి జెందియుండిరి. ఇప్పటికయినను దమ్ము నెమ్మదిగా నుంచినచో ననేకవందనము లొనరింతురు. ఎవరి వల్లను నధికారముఁ బొందిన యేజంటు కాఁడుగనుక హైందవ సంఘుమునకుఁగా నాయన కేమియు నష్టము కట్టియిచ్చుటకు వీలు లేదు. ఆయన యింకొక ప్రతిష్ఠ చేయబూనుకొనుట కేమియు విధిలేదు. తానాపూజలో సంబంధము కలిగించుకొనుటకు వీలు లేదుగనుక తనకు గలిగినదను పారమార్థిక నష్టమునకుగాను ప్రతి ఫలము కోరవలసియుండఁగా దిరిగి ప్రతిష్ఠచేయుటకు గావలసిన ద్రవ్యమిప్పించుమని కోరినాఁడు. పారమార్థికనష్టమును నోరినను దానికి సమానముగాఁ జెప్పఁదగిన ప్రాపంచిక వస్తువులేమియు నుండనేరవు గనుక పారమార్థిక నష్టము ద్రవ్యరూపముగా నిర్ధా రణచేయుటకు వీలులేదు. కాబట్టి నష్టమును గుఱించిన దావాకూడ నిలువదగినది కాదు. విశ్వబ్రాహ్మణులు సంబంధము పుచ్చుకొనుట వలన దేవతాశిలలు అపరిశుద్ధము లైనవని కాని ముందపరిశుద్ధము

లగునని కాని ఋజువు కాలేదు గనుక యింజక్షన్ గూడ నిప్పించుటకు వీలులేదు. ఈసారాంశము కూడ వాదికి విరుద్ధముగా తీర్మానించితిని.''

''ఈదావాయందింకొక విచిత్రమున్నది. ఒకటవ ప్రతివాది యీ ప్రతిష్ఠ చేయుటకుఁ బిలువంబడిన యన్యగ్రామవాసి. గ్రామస్తులు సొమ్మునిచ్చి యేర్పరచుకొన్న యేజంటు. వాది ప్రత్యేక మాయన మీఁద వ్యాజ్యము దెచ్చుటకుఁ గారణము లేదు. ఏమేని యున్నను నాయన చనిపోయినందువలన సంక్షేపించుకొనవలసియుండెను. కాని

---

షరా:-''ప్రతివాదుల తరఫు దాఖలయిన దస్తావేజులు - 1 పురుషసూక్త భాష్యము (పేజి 13, 14 మఱియు 19) 2 వజ్రసూచికోపనిషత్తు (343, 748 మఱియు 749) 3 కృష్ణయజుర్వేదము (పేజి 85 మరియు 93 తైత్తిరీయసంహిత) 4 కృష్ణయజుర్వేదము (పేజీ 10 బ్రాహ్మణ భాగము) 5 నానార్థరత్నమాల (పేజి 246) 6 సిద్ధాంతకౌముది (పేజి 326) 7 ఆపస్తంబశ్రౌతసూత్రము (పేజి 240) 8 బ్రాహ్మణోత్పత్తిమార్తాండము (పేజి 562) 9 కృష్ణయజుర్వేదము (తైత్తిరీయసంహిత)3వ యధ్యాయము 4 వ కాండము పేజి 41 (ఎ) డిటో డిటో పేజి 92 1 వ భాగము 5 వ యధ్యాయము 2 వ కాండము) 10 విష్ణుపురాణము (పేజి 94 మరియు 286) 11 భాగవతము (పేజి 201, 490 మరియు 491) 12 మనుస్మృతి (పేజి 77, 376, 550) 13 గార్గేయాగమము (పేజి 2, 8, 15, 16, 29, 30, 32, 33) 14 కపిలగీత (3 వ యధ్యాయము పేజి 24) 15 విశ్వబ్రహ్మోపనిషత్తు (పేజి 2, 3) 16 నిరుక్తము (ఉత్తరపటి పేజి 310, 316) 17 ఋగ్వేదసంహిత (పేజి 464, 467 ప్రథమాష్టకము) 17 (ఎ) ఋగ్వేదము (ద్వితీయాష్టకము, పేజి 221, 223 మఱియు 225) 17 (బి) డిటో తృతీయాష్టకము పేజి 138, 169) 17 (సి) డిటో చతుర్థాష్టకము పేజి 356) 17 (డి) డిటో (అష్టమాష్టకము పేజి 35) 18 ఐతరేయ బ్రాహ్మణము (పేజి 764) 19 అగ్నిపురాణము (పేజి 52, 53, 57) 20 వాల్మీకిరామాయణము (పేజి 34) 21 కాశీఖండము (పేజి 622) 22 శేషధర్మము (పేజి 76) 23 నిర్ణయసింధువు (పేజి 240, 241) 24 నాగరఖండము (14, 17, 18, 26, 27, 31) 24 (ఎ) డిటో (తెలుగు) 35 సంస్కృతశబ్దార్థకల్పతరువు (పేజి 602)

సి. రంగనాయకులు, అడిషనల్ డిస్ట్రిక్టు మున్సిఫు. (స్వ॥ చ॥ (289, 290 పు)

తరువాత గూడ వ్యాజ్యమును నడుపఁగూడదు. 2 మొదలు 5 వఱకైన ప్రతివాదుల కీప్రతిష్ఠతో నేమియు సంబంధము కలిగియున్నట్లు తోఁచదు. వారు ప్రతివాది సంఘమునకుఁ జేరియుండుట యేతప్ప నితర కారణమేమియు లేదు. వారిలో నెవరైన నక్కడనుండినారనుటకుఁగూడ సందేహమే. కొంతమంది యక్కడ లేమని కూడఁ జెప్పుచున్నారు. వారిమీఁద వ్యాజ్యమునకుఁ గారణములేనట్లు తీర్మానించుచున్నాను. వాదికీ వ్యాజ్యము జరిగింపవలెనని యభిప్రాయమున్నది గనుక ఇందు ముఖ్యముగాఁ బ్రతివాదులుగాఁ జేర్పదగిన వారు దీనికిఁ జందావేసి ప్రతిష్ఠయేర్పాటుచేసిన తన గ్రామపు వారయియున్నారు.''

''ఆయన నిశ్చయముగాఁ జాలకాలమునుండి యుభయవాదుల యొక్క మనస్సులను గలంచెడి బ్రాహ్మణులెక్కువ విశ్వబ్రాహ్మణులెక్కువ యనెడి వాదము ద్వారమున నైన కోపమును బుట్టించు విషయమై పోరాడవలెనను నుద్దేశముతో నున్నవాఁడు. ఆత్మ ఘనతను దెలుపుకొనుటకుఁ గా నుభయవాదులు నభినవసరస్వతి ప్రబోధినుల ద్వారమునఁ గ్రోధమును వెళ్ళఁగక్కుచున్నారు. ఈదావా చీదఱపుట్టించు నటువంటిది. కత్తులతోఁ ద్రోసివేయుటయైనది.''

''1912 సంవత్సరం మార్చి 30 వ తేది. పబ్లికు కోర్టులో నీ తీర్పు చెప్పఁబడినది. (సంతకము) సి. రంగనాయకులు, అడిషనల్ డిస్ట్రిక్టు మున్సిఫ్.'' (స్వా. 288 పుట.)

---

గుంటూరు టెంపొరెరీ సబ్ జడ్జీకోర్టు మహారాజశ్రీ ఏ. సాంబమూర్తి అయ్యరు అవర్గళు, బి. ఏ., బి. యల్., సబ్ జడ్జి. 1915 వ సంవత్సరము 25 వ సెప్టెంబరు శనివారము నెం. 4 రు. అప్పీలు.

గుంటూరు జిల్లా కోర్టు ఫయిల్ 12 వ సంవత్సరము నెం. 324 అప్పీలు

## గుంటూరు టెంపొరరీ సబ్ జడ్జికోర్టు తీర్పు

## అధ్వర్యువ్యవహార దర్పణము (విజయధ్వజి)

పాఠక మహాశయులారా! కేవలము బ్రహ్మద్వేషభూయిష్ఠుఁడైన జానపాటి పట్టాభిరామశాస్త్రి వాదియై ప్రతివాదులైన వోలేటి లక్ష్మయ్య మొదలగువారి నింకనూ సాధింపనోయని- అక్రమముగా తానొనర్చియున్న క్రిమినల్, సివిల్ (డిష్ట్రిక్టుమున్సిఫు కోర్టు) వ్యవహారములలో పొందియున్న ఫలితములు చాలకనో యన *గుంటూరు టెంపొరరీ సబ్ జడ్జి కోర్టులో నప్పీలు దాఖలు చేసెను. అందుం గూర్చి ధర్మసూత్రములు తనకుఁగాదన్న శ్లోకరువు పెట్టుట యీక్రింది పద్యమునం గాంచవచ్చును. చూ॥

వ్యవహారము:-

ఆ. భగవదాజ్ఞ యగుచుఁ బరఁగు శ్రుతిస్మృతుల్,
పలికినట్టుల మనము నలుపవలయు,
కాని యల్పశంక కల్పించుకొని స్వేచ్ఛ,
చనుట నరకమునకుఁ జనుట యగును. (స్వా. చ. 222)

---

అప్పిలెంటు:- జానపాటి పట్టాభిరామశాస్త్రి.

రెస్పాండెంట్లు:- 1. నందిగామ కాశీపతి. 2. సిరిపురపు భిక్షాపతి. 3. నందిగామ చినబ్రహ్మము. 4. జుజ్జూరి మల్లయ్య.

★ గుంటూరు అడిషనల్ డిష్ట్రిక్టు మున్సిఫుకోర్టుఫయిల్ 1911 వ సం॥ నెం. 26 అసలు దావాలో 30-3-1912 వ తేదీన కోర్టువారిచేఁ జేయఁబడిన డిక్రీమీఁది యప్పీలు.

అసలు నెం. 26/1911 లోని పార్టీలు - వాది జానపాటి పట్టాభిరామశాస్త్రి. ప్ర॥ వాదులు - వోలేటి లక్ష్మయ్య వగైరాలు. 1915 వ సం. ఆగష్టు 6. 7 వ తేదీల నప్పిలెంటుతరఫు ప్లీడరు రంగావఝ్ఝల హనుమయ్య, రెస్పాండెంట్ల తరఫు ప్లీడరు మాడభూషి వెంకట నరసింహాచార్యులు గార్లచే హీరింగు చేయఁబడి యీరోజువఱ కాలోచన నిమిత్తము వాయిదా వేయబడి కోర్టువారిచే నీరోజునఁ జేయఁబడిన తీర్మానము (స్వా. వ్య. 291 పుట.)

అప్పీలును చక్కగ పరిశోధించి త్రోసివేయుచు సబ్ జడ్జి గారు వ్రాసియున్న జడ్జిమెంటులో ప్రతివాదులు బ్రాహ్మణులనుటం గూర్చి శ్రుతిస్మృతుల్ పలికినట్లు సల్పెనో తద్విరుద్ధముగ సల్పియుండెనో పరికింప నీక్రింద నందలిముఖ్యాంశంబుల నుదాహరించు చున్నాను. చూ.

"ఈ దావాలో నాన్నరు దాఖలుచేసిన తర్వాత బ్రాహ్మణులందరి తరఫునను పని బదిచేయవలసినదని వాది పిటీషన్ బెట్టినాడు. ఆపిటీషన్ ప్రతివాదులాక్షేపించిరి. అందుపై త్రోసి వేయబడినది. అందుపైని దావా యాలయములలోఁ దానుగూడఁ బూజచేయువాఁడే యైనందున స్వంతహోదాలోనే దావానడుపుటకు వాదికోరినాఁడు. క్రింది కోర్టువారు ఒకరిని గష్టపెట్ట నుద్దేశించి వేసినదిగా నెంచి త్రోసివేసిరి. మఱియు నితరులైన యెవరి తరఫునను దావా తేక స్వయముగానే తెచ్చినందున దన కాముష్మికము కలిగియుండఁగా నట్టి నష్టమిప్పించుఁడని (రుజువును) కోరనందునను నష్టముకూడ నిప్పించుటకు వీలులేదని తీర్మానించిరి. డిక్లరేషన్ విషయములోను, ఇంజక్షను విషయములోను గోర్టు వారు చేసిన తీర్మానము మీదనే వాది యప్పీలు చేసినాఁడు. "తీర్మానింప వలసిన విషయము లేవనఁగా 1. దావా దేవతాశిలల ప్రతిష్ఠచేయుటకు (వాదియైన యీ వైదికజాతి) బ్రాహ్మణులకు మాత్రమే యధికారముగలదా? 2. అట్టు (ప్రతివాదుల జాతి

---

సుమారు రెండువందల సంవత్సరములనాఁడె బహువ్యాప్తంబయియున్న "పంచాశత్ఖండమండితంబగు శ్రీ స్కాందపురాణంబునందలి ప్రథమ ఖండంబయియున్న సంస్కృత నాగరఖండంబునందలి శ్లోకంబులనేకము క్రోడీకరించియున్న వ్యాఖ్య లిదివరకె ప్రకటించియుంటిమి. శాలివాహనశక ౧౫౦౭ సంవత్సర ప్రాంతంబున వాదిజాతికి సంబంధించినవారే యగు శ్రీ దుర్గారాజకవివరాయ్యంకి బాలసరస్వతి నామధేయ ప్రణీత ఆంధ్రానువాద పద్యప్రబంధము

బ్రాహ్మణులు ప్రతిష్ఠ) జేసినయెడలఁ దద్దేవతలఁ బూజించువారిలో నొకఁడైన వాదికి సొంతహోదాతో దావా తెచ్చుటకుఁ గారణమైన యపవిత్రపుఁబని జేసినారా? 3. వాదికి ఇంజక్షన్ డిక్లరేష నీయఁదగినదేనా?"

---

గలుగుటయు దానినే "సటీకా నాగరఖండం" బను పేరిట వాదిజాతికి సంబంధించిన వాఁడేయగు శ్రీ మతుకుమల్లి రామకృష్ణశాస్త్రిగారొనర్చిన టీకా తాత్పర్యసహిత (క్రీస్తుశక 1809సం॥రం మద్రాసునందు ముద్రితంబయిన రెండు భాగంబులు) గ్రంథం బిప్పుడునులభించుచున్నది. అందలి కథం దెల్పు ప్రథమాశ్వాసాంత గద్యము నిట నుదదాహరించుచున్నాను. చూ॥

"ఇది శ్రీ మద్దుర్గాదక్షిణామూర్తి వరప్రసాద ఫలిత తుర్గారాజకవివరాకయ్యంకి బాలసరస్వతి నామధేయ ప్రణీతంబయిన శ్రీ స్కాందంబను మహాపురాణంబునందు సనత్కుమార సంహితయను నాగరఖండంబున నైమిశారణ్యవర్ణనంబును......పార్వతీదేవి జగత్కారణ దేవుం డెవ్వండని శివు నడుగుటయును, శివుండు శ్రీ విశ్వకర్మ మహానుభావంబును జెప్పుటయును సూతునిచే చెప్పంబడిన శివకుమార సంవాదంబు విని శౌనకాదులు యవ్వలి వృత్తాంతం బడుగుటయు నను కథం గల ప్రథమాశ్వాసము" (సటీకా॥ నా॥ ప్రథ)

ఇంకను నందలి ద్వితీయాశ్వాసమునంగల "త్వష్టబ్రహ్మ మహిమాను వర్ణనముం గాంచెదము గాక. చూ॥

క॥ జంభారి సురార్చిత పా, దాంభోజుఁడు విశ్వకర్మ యాత్మజుఁ డతులా,
రంభుండు త్వష్టధ్వర, సంభూతశ్రుతి పదార్థచర్చ యొనర్చున్.
(స॥ నా॥ ద్వి॥ ౨౪)

టీక॥ జంభారి సురార్చిత పాదాంభోజుఁడు, జంభారి = దేవేంద్రుఁడు మొదలైన; సుర = దేవతలచేత; అర్చిత = పూజింపబడ్డ, పాదాంభోజుఁడు = పాదపద్మములు గలట్టియు; విశ్వకర్మ = విశ్వకర్మకు; ఆత్మజుఁడు = పుత్రుఁడైనట్టియు; "అతులారంభుండు" అతుల = సాటిలేని; అరంభుండు = ప్రయత్నములు కలవాఁడు; త్వష్ట = త్వష్టబ్రహ్మ; 'అధ్వరసంభూత శ్రుతిపదార్థ చర్చయు' అధ్వర = యాగములకొరకైన; సంభూత = పుట్టిన; శ్రుతి = వేదములయొక్క; పదార్థ = శబ్దార్థములయొక్క; చర్చ=పరిశీలనము; ఒనర్చున్ = చేయును.

"ప్రతివాదులు దాఖల్ చేసిన ప్రమాణగ్రంథములలోని యెగ్జిబిటు 3-4-17 కృష్ణయజుర్వేద ఋగ్వేదలములో జెప్పబడి నటువంటియు, ప్రతివాదులచేఁ దమమూలపురుషుఁడుగాఁ జెప్పఁ బడునట్టియు విశ్వకర్మ పరాత్పరుఁడుగాని శిల్పికాఁడని తెలియవచ్చెడిని."

"6వ మార్కుదస్తావేజు వలన రథకారులు బ్రాహ్మణులని కనఁబడదు..." "...ఐతే ఒక బ్రాహ్మణునిపేరు రథకారుఁడని కనఁబడును."

---

కం॥ ఈ వేదవాణి జననీ, భావంబున వలరు జగతి బ్రాహ్మణ్యమునున్
వ్యావర్తింపగ గాదని వేవాద మొనర్చువాఁడు వృజినము బొందున్.(౫౪)

ఈ స॥ నా॥ పద్యప్రబంధంబునకైయున్న కృతిపతి నుతి నీ క్రింద నుదాహరించెదను. దీనివలనఁ బ్రతివాదుల వంశజ సుప్రసిద్ధ ప్రభుసత్తము ప్రశస్తింగూడ నెఱుంగనగును. చూడుం డందలి ప్రథమాశ్వాసము.

కం॥ అతఁడు ప్రసిద్ధి వహించెన్, క్షితి నరగజపతుల గెలిచి చెలగి జయశ్రీ
పతిఁజేకొనినమహంచా సతుపశహాచంద్రునకును కుడిభుజమనగన్॥(ప్ర౧౭

తా॥ యోధులైన గజపతి మహారాజులను జయించిన మహమ్మద్ ఖుతుబ్ షా అను రాజునకు కుడిభుజము (మంత్రి) అయిన మార్కండేయ మహీపతి ఖ్యాతిని పొందెను.

కం॥ శ్రీపెందోట పురాధిప, భూపతి జనవశ్య దృశ్య పుణ్యచరిత్రా
ద్దీపిత వైభవ జంబూద్వీపజనోద్దండ సోనవిభుమార్కండా.(స॥నా॥ద్వితీయాశ్వాసము॥ ప్రాజ్ఞలోక కల్ప భూజ। భాగ్య రాజరాజ వి। శ్వజ్ఞ
గోత్ర సత్పవిత్ర। వైభవారి గోత్ర భా, వజ్ఞమంత్రి వర్గ నిత్య। వర్ణితీయ
సద్గుణా, భిజ్ఞ రాజపూజ్య కుంత। భిన్నయోధ శేఖరా! (స॥నా॥పం॥౧౭౭)

టీ॥ ప్రాజ్ఞ = పండితులయొక్క; లోక = సమూహమునకు; కల్పభూజ= కల్పవృక్షమువంటివాఁడా!; భాగ్య = భాగ్యమునకు; రాజరాజ = కుబేరుని వంటివాఁడా!; విశ్వజ్ఞ = విశ్వజ్ఞబ్రహ్మయొక్క; గోత్ర = వంశమందు; సత్పవిత్ర = మిక్కిలి పరిశుద్ధుఁడా!; వైభవ=వైభవమునకు; అరిగోత్ర=దేవేంద్రుని వంటివాఁడా!; భావజ్ఞ = భావమును తెలిసిన; మంత్రివర్గ = ప్రధానబృందము

"మనుష్యులు నాలుగుజాతులుగా విభాగింపఁబడినారనియు, వానిలోనుండు భేదములు కొంచెమించుమించుగా బుట్టుకతోనే వచ్చినవని హైందవులు నమ్ముచున్నారు. ఇంతవరకు నీ హిందూ దేశములో నుండు మానవుల నాయా జాతులక్రింద విభజించుట కెట్టికష్టమును గనఁబడదు."

---

చేత; నిత్య = ఎల్లప్పుడు; వర్ణనీయ = కొనియాడబడతగిన; సద్గుణా = మంచి గుణములు కలవాఁడా!; అభిజ్ఞ = పండితులచేత; రాజ=ప్రభువులచేత; పూజ్య= సన్మానింపబడినవాఁడా!; కుంత = బల్లెములచేత; భిన్న=పొడువఁగబడిన; యోధ శేఖరా! = వీరశ్రేష్ఠులు గలవాఁడా!; (అనగా) శత్రుభయంకరుఁడా!; అని తాత్పర్యము. (బెజవాడకునధీశ్వరులు ఒకప్పుడు శ్రీ ధవళేశ్వరపువారై యున్నట్లు తెలిసెడిని).

ఈ "పంచాశత్ఖండమండితంబగు స్కాందమహాపురాణ ప్రథమ ఖండంబయియున్న నాగరఖండ శ్లోకములకు ప్రతిగా పద్య ప్రబంధమునొనర్చిన కృతికర్త నియోగి యని తెలియవచ్చును. "విప్రకుల దర్పణము" లో తల్లాప్రగడ వారి చరిత్ర ప్రచురించుపట్ల నా సంపాదకుఁడైన సత్తిరాజు సీతారామయ్య గారిట్లు తురగా వారింగూర్చికూడ వ్రాసియుండుట వారి ప్రశస్తింగూర్చి యిట నుదాహృతము.

"పూర్వము (1736 సం॥) ఉంగుటూరు నందున్న వారిలో తల్లాప్రగడ సూర్యప్రకాశరాయఁడుగారు మహదైశ్వర్య సంపన్నుఁడై ఉంగుటూరునందు గొప్ప భవనము కట్టించెను. తురగా రామకవి యీయనకు బావమరది యగుటచే తాను కట్టించిన భవనము నాయనకుఁ జూపదలంచి వెంటబెట్టుకొని లోనికి దీసికొనివెళ్ళి పర్యాచకునిగా రామకవి నొకగదిలోవిడచి తానొక చోటికేగి దాగియుండెననియు రామకవి గారా యింటం దిరిగి తిరిగి వచ్చిన త్రోవఁ గనుఁగొనలేక విసిగి—

గీ॥ అంగణములెన్ని కేళిగృహంబులెన్ని, సౌధ వీథుల యిండ్లెన్ని మేడలెన్ని
కట్టె కాకేమి సూర్యప్రకాశరాయఁ, డుంగుటూరింట గాకాసులుండవచ్చు.

అని నుడివిన తోడనే భయంకరంబుగ నరసుచు నా యింట నే నూరలఁ జూచినను దామె యయి పట్టపగలు పిశాచములు సంభవించెనట." (విప్రకులదర్పణము 161 పుట) ఈ తురగా రామకవియు నాగరఖండ ప్రబంధకర్త యగు

''ఇతరయుగములలోమాదిరిగా నీకలియుగములో నొక జాతివారలతకంటె నుత్కృష్టజాతికి వచ్చుటకు వీలులేదనికూడ నమ్ముచున్నారు. బ్రాహ్మణులు తనకిష్టమైన వృత్తినవలంభించుటకుఁ బ్రమాణంబున్నది...''

''ప్రథమమందీ దేవాలయములు కట్టించినవారియొక్కయు, నీవిగ్రహములఁ బ్రతిష్ఠించిన వారియొక్కయు పేళ్లుచెప్పలేనని వాదియే యొప్పుకొనుచున్నాఁడు...''

౧వ ప్రతివాది యనేకస్థలముల నిట్టిప్రతిష్టలుచేసినట్లు సాక్ష్యముండుటంజేసియు నీ ప్రతిష్ఠ వేయించిన (''కరణము రంగయ్య'' మొదలైన) జాతివారుగాని యంతకుఁ దక్కువవారుగాని పూజ చేయుటకే విగ్రహముల బ్రతిష్ఠించినట్లు కనబడెడిని...''

"వాది యీప్రతిష్ఠవలన నేమియు నష్టముపొందినట్లు కనుబడుట లేదు. గ్రామదేవతలు (వాదిజాతి) బ్రాహ్మణులచేతనే ప్రతిష్ఠింపఁబడవలసినట్లు ప్రమాణము లేదు. సాక్ష్యమును లేదు. ఇంకను 23వ మార్కుదస్తావేజు (నిర్ణయసింధువు) లో దీనికి విరుద్ధముగనే యున్నది. వాదిచేఁ గనంబఱుపంబడిన ప్రమాణములనుబట్టి కూడ నీ విగ్రహములను జేయు (బ్రాహ్మణ) రథకారులు - లేక శిల్పులను వారు ప్రాణప్రతిష్ఠకుఁబూర్వము శాంతకర్మను చేయవలసినట్లు గాఁ గన్పడెడిని.''

---

తురగా రాజకవియు నొక్క వ్యక్తియై యుండునేమో యనిపింపఁగలదు - వీరి సమయమును రమారమి యొకటి యగుట యింటిపే రొకటియు, నామధేయ మించుమించు యొకటిగ నుంటచే నీ యూహకు కారణంబయి యున్నది. ఏదెట్లయినను తల్లాప్రగడ వారికి బావమఱది యగుట నీ రాజకవియు నియోగియే యని చెప్పవచ్చును. ఇట్టి కవితల్లజులచే కృతి పొందగల్గిన వా రెంతయు స్తవనీయులనక తప్పదు. ఇంకను నామిప్రపఁలదర్పణమునందు గోత్రప్రవరాదులను కూడ నుల్లేఖించియుండుటచే వాని నీక్రిందఁ గనంబరచుచున్నాము. చూ॥

"ఈకేసు విషయమై పైని నేనభిప్రాయపడినదానినిబట్టియు రికార్డులోనుండు సాక్ష్యమునుబట్టియుఁ జూడగా నైహికాముష్మిక సంబంధమైన యెట్టినష్టమును (ఈ వైదికి) బ్రాహ్మణుడైన వాది పొందలేదనియు వ్యాజ్యమునకుఁ గారణమేర్పడలేదనియు నష్టమిప్పింపఁదగిన యేయపకారమును బొందలేదనియు నేను మనస్ఫూర్తిగాఁ జెప్పుచున్నవాడను. ఇతరుల నష్టపెట్టుటకైనను కాక పోయినను సీదావా మంచిసలహాలతోఁ జేయఁబడలేదని నాయభిప్రాయము. పైతీర్మానమునుబట్టి యీ నప్పీలు కర్చులతో ద్రోసివేసితిని. ఎ. సాంబమూర్తి అయ్యరు, సబ్ జడ్జి.

25-9-1915 (స్వ. 307 పుట)

ప్రతివాదులు వేదాది ధర్మశాస్త్రములచే రుజువుపరచి తామే బ్రాహ్మణులనియు వాది బ్రాహ్మణుఁడు కాడనియు దృష్టాంత ప్రదర్శన పురస్సరంబుగ వాదించియుండినను శ్రీ సబ్ జడ్జిగారు దానిం బెఱితోవం బట్టించెను, గాని ఋగ్వేదాదులందు గల తెఱం

---

"1. వెలనాటి వైదికులు- (వీరు) విశ్వామిత్ర, అఘమర్షణ, కౌశిక' అని త్ర్యార్షేయము చెప్పుకొనుచున్నారు. 2. తెలఖాణ్యపు వైదికులు- ...... ...... మిత్రస (ఈ మిత్రస గోత్ర మే గణములో చేరినదో తెలియరాదు.)"

నియోగులనుగూర్చి—

1. గోపరాజువారు (వీరిలోని యొక మంత్రియే విశ్వకర్మ బ్రాహ్మణుల గ్రామ కరిణీకముల నారువేలు ఒకేపర్యాయము అసలు వారి కెరుకలేకుండగనే రాజును సయతము వంచించి దాననెపమున రాజముద్రను పొంది తనవారి వశ మొనర్చుకొనెనని చరిత్ర మెరిగింపంగలదు.) వీరు భారద్వాజ, శాండిల్య, కౌశిక, చికితస, సాంఖ్యాయన, కౌడిన్య, శ్రీవత్స గోత్రముల వారున్నారు. ఇందు (1) ఆర్వేల నియోగులు (2) యాజ్ఞవల్క్య నియోగులు - అందు ఆర్వేల నియోగులలో భారద్వాజ, శాండిల్య, కౌశిక, చికితస, సాంఖ్యాయన, కౌండిల్య శ్రీవత్స యను సప్తగోత్రములవారు గలరు. యాజ్ఞవల్క్యలలో, కౌండిల్య, కౌశిక గోత్రములు గలవు. (విప్రకులదర్పణము)

గుసు మాత్రము గప్పిపుచ్చం జాలకనో యన "ఐతే ఒక బ్రాహ్మ ణునిపేరు రథకారుఁడని కనంబడున"నియు, "బ్రాహ్మణుఁడు తన కిష్టంబైన వృత్తి నవలంబించుటకుఁ బ్రమాణం బున్నదని"యు లిఖింపంగలైను.

నిజంబున కా రథకారనామక బ్రాహ్మణుఁడు ప్రతివాదుల జాతికి పూర్వుండనియు దేశహితాభ్యున్నతికై తమకిష్టమైన వృత్తుల నన్నింటిని వేదకాలాదిగా నేటివఱకు అవలంబించుచున్నవారు బ్రాహ్మణులైన ప్రతివాదుల వంశీయులేననియు గ్రహింపగల్గుచో శ్రుతిస్మృతుల్ పల్కినట్లు సల్పినవారేయై యుండెడివారు.

ఒకపుడు విజయనగర మహారాజ శ్రీరామరాజభూపాలుని సమక్షమంబున నీ (రథకార) బ్రాహ్మణ మీమాంసపై బందరు పట్టణనిలయ శ్రీ పేరవల్లి రాఘవశాస్త్రిగారు గావించియున్న సంస్కృత వ్యాఖ్యానంబును ఇట సంశయనివారణార్థ ముదాహ రించుచున్నాను. చూ॥

"శ్రుతిరేవప్రమాణమ్. సాశ్రుతిః కేతిచేత్ విశ్వరూపో వై త్వాష్ట్రః పురోహితో దేవానా మాసీ"దిత్యాదిరితిగృహాణ. తథాహి భారతే శాన్తిపర్వణి మోక్షధర్మే నారాయణీయే ఏకా దశశతమాధ్యాయే, తథా భాగవతే షష్ఠస్కంధే షష్ఠాధ్యాయే, పురాఖలు దేవేన్ద్రః త్రైలోక్యైశ్వర్యమదమత్తస్సన్ త్రయస్త్రింశ ద్దేవతా పరివేష్టితః స్వసన్నివిష్టసభామాగతం బృహస్పతి మాచా ర్యం ప్రత్యుత్థానాది భిర్నార్చయామాస. తతః క్రుద్ధో బృహ స్పతిః స్వగృహమేవజగామ తతో దేవేన్ద్రః స్వాచార్య నిరాకర ణేన దుఃఖితస్సన్ బృహస్పతిం మామనుగృహ్ణీష్వేతి ప్రార్థయా మాస. తతో బృహస్పతి నిరాకృతో దేవేన్ద్రః దేవాసుర సం గ్రామే అసురైర్నిర్జితస్సన్ దేవైస్సహ బ్రహ్మాణం శరణంయయౌ.

తతశ్చతుర్ముఖః ఇన్ద్రాదీనుద్దిశ్య ఆచార్య నిరాకరణేన భవతా మియం విపత్తిః ప్రాప్తా. తస్మాద్యుష్మత్కార్యం త్వాష్ట్రో విశ్వరూపస్సంవిధాస్యతి తం ప్రార్థయయధ్వమితి. తద్విశ్వరూపం భజతాశు విప్రం తపస్వినం త్వాష్ట్రమథాత్మవన్తమ్- సభాజితోऽర్థాన్ సవిధాస్యతే వోऽయధిక్షమధ్వం యదుతాన్య కర్మ ఇత్యాదినా బ్రహ్మణాకృతాభ్యనుజ్ఞాతాస్సన్తో విశ్వరూపాశ్రమం గత్వా విశ్వరూపం ప్రార్థయామాసుః కిమితిచేత్ వృణీమహేత్వోపాధ్యాయం బ్రహ్మిష్ఠం బ్రాహ్మణం గురుం. యథాంజసా విజేష్యామ స్సపత్నాం స్తవ తేజసా - అభ్యర్థితః సురగణైః పౌరోహిత్యే మహాతపాః - సవిశ్వరూపస్తానాహ ప్రహసన్ శ్లక్ష్ణయాగిరా. అకించనానాంహి ధనం శిలోంఛనం తేనేహనిర్వర్తిత సాధుసత్క్రియః- కథం విగర్హ్యం నుకరోమ్యధీశ్వరః పౌరోధ సంహృష్యతి యేన దుర్మతిః తథాऽపి ప్రతిబ్రూయామ్ గురుభిః ప్రార్థితంకియత్? భవతాం ప్రార్థితం సర్వమ్ ప్రాణైరర్థైశ్చసాధయే - తేభ్య ఏవం ప్రతిశ్రుత్య విశ్వరూపో మహాతపాః - పౌరోహిత్యం వ్రతంచక్రే పరమేణ సమాధినా. సురద్విషాం శ్రియం గుప్తామౌశనస్యాపి విద్యయా - ఆచ్ఛిద్యాదాన్మహేన్ద్రాయ వైష్ణవ్యా విద్యయావిభుః. యయాగుప్తస్సహస్రాక్షోజిగ్యేऽసురచమూర్విభుః - తాం ప్రాహసమహేన్ద్రాయ విశ్వరూప ఉదారధీః - యాంప్రవిశ్యాసురాన్ హన్యాత్ కష్ప్యాం నారాయణాత్మికామ్ - అజైషీద్వృషభస్తాత సింహాం క్షుద్రమృగానివేతి. ఏతేన విశ్వకర్మణః బ్రహ్మత్వం, బ్రహ్మర్షిత్వం బ్రహ్షివంశజత్వమ్, దేవత్వమ్, దేవర్షిత్వమ్, దేవపురోహితత్వమ్, దేవవర్ధకిత్వమ్ ఆధునికవర్ధకి (విశ్వబ్రాహ్మణ) వంశకరత్వంచ ప్రతిపాదనాత్ తద్వంశజానాం రథకారాదిపఞ్చానాం వైదిక కర్మణ్యధికారిత్వమ్ వేదాధికారిత్వం, పౌరోహిత్యమ్, ఆచార్య

త్వంచ సర్వంసంగచ్ఛత ఇతి సర్వం రమణీయమ్.

(రథకారాధికరణవిచారః ౧౮౦ పుట)

శాస్త్రీయచర్చ - సర్వం బెఱింగియు దివాంధంబులట్లు పెఱ ఛోరణిం బ్రకటించువారి యపభ్రంశంబులన్నియు పై వ్యాఖ్యానముల వలన మూలచ్ఛేదంబులగుచు నట్టివేయగు జడ్జిమెంటులోని శంకి తాంశంబులను ప్రత్యేకించి మేమిట విమర్శింపంబని లేదు.

ఋగ్వేదాదులను పరిశ్రమించిచూచి హైందవులేయైన వాది ప్రతివాదుల జాతీయాన్వయంబులను సయితము తారుమారొనర్చుటతో నీ సబ్ జడ్జి (సాంబమూర్తిఅయ్యరు) గారు తన యిష్టము వచ్చినట్లు వర్ణవిభాగంబును లేకెత్తించి "హిందూదేశములోనుండు మానవుల నాయాజాతుల క్రింద విభజించుట కెట్టి కష్టము నుండ నేరద"నుటచే నాయా ప్రధానాంశంబులను క్రోడీకరించుచు ఆదిం గల తెలుంగెఱుంగుట మనకు కర్తవ్యంబై యున్నది. చూ॥

"(జడ్జిమెంటు) ... విశ్వకర్మ పరాత్పరుండుగాని శిల్పి కాడని తెలియవచ్చెడిని" అనుటచే నీ సబ్ జడ్జిగారిచర్చ చెప్పిన విశ్వకర్మ శిల్పియైనను కాకపోయినను పరాత్పరుండనునదిమాత్రము నిర్వివాదాంశంబై స ట్లగపడుచున్నది. కావున నదే యంశంబు ననుసరించుచు పూర్వోదాహృత ప్రమాణంబులతో రికార్డులోని అంశంబులను "హంసక్షీరన్యాయంబున" విభజించుచు శ్రుత్యుక్త వర్ణ విభాగముతోపాటు నీ వాది ప్రతివాదుల జాతీయతంగూర్చి నిరూపించి చూచెదము గాక. ఆ విరాట్స్వరూప వర్ణవిభాగంబునుం గూర్చి —

శ్రుతి - "బ్రాహ్మణోస్య ముఖమాసీత్ । బాహూరాజన్యః కృతః ఊరూతదస్యయద్వైశ్యః । పద్భ్యాగ్ం శూద్రోఅజాయత."

"అస్య = ఈ విరాట్పురుషునకు; బ్రాహ్మణః = బ్రాహ్మణుఁడు; ముఖమ్ = ముఖము; ఆసీత్ = అయ్యెను; రాజన్యః = క్షత్రియుఁడు; బాహూ = భుజములుగా; కృతః = చేయఁబడెను; అస్య = ఈవిరాట్టుకు; ఊరూ = తొడలు; యత్ = ఏదియో; తత్ = అది; వైశ్యః = వైశ్యుఁడు; పద్భ్యాగ్ం = పాదములవలన; శూద్రో = శూద్రుఁడు; అజాయత = పుట్టెను; (పురుషసూక్త ప్రతిపదార్థము.)

వంశవృక్షము వలన ప్రతివాదులు బ్రహ్మర్షి సంప్రదాయ బ్రాహ్మణులనియు, వాది క్షత్రియవంశఋషి సంప్రదాయుండనియు-వైదిక కులుండనియు తెలిసికొనుట కెంతమాత్రము కష్టమున్నట్లు లేదు. కావున జడ్జిమెంటులోని బ్రాహ్మణ పదప్రయోగము, అందుకు సంబంధించిన వాక్యాలు, అర్థాలు కూడ విభజించుట కష్టము కానేరకున్నది. చూ॥

---

"వినాశకాలే విపరీతబుద్ధిః" అనునట్లు యీ వాదివలె స్వార్థపరతచే చిత్తూరుజిల్లా 'శదుప్పేరి' యను గ్రామంబున 'పంచాంగం గుండయ్య' యను వైదికుఁడు 'మార్గసహాయాచార్యులు'గారను విశ్వకర్మ - బ్రాహ్మణునితో పౌరోహిత్యమున వివాదపడి, వివాహసమయమున అడ్డుతగిలి చేసిన వ్యవహారముపై సదరు చిత్తూరుజిల్లా అదాలతుకోర్టులో ఫయిలు నెం. 205, 1818సం॥ డిశంబరు 15వ తేది జడ్జి డేకరుదొరవారిచే యేర్పడిన తీర్పునందు విజితుండగుటయు - శాస్త్రరీత్యా బ్రహ్మశ్రీ వేదమూర్తులైన మార్గసహాయాచార్యులుగారు వేదోక్తకర్మాధికారిగా దిగ్విజయమొందినట్లు తెలియంగల రికార్డుతో "చిత్తూరుజిల్లా అదాలతుకోర్టుతీర్పు' అను పేరిటి గ్రంథంబు లానాటనుండి నేటివరకు ప్రచురింపంబడుచునేయున్నవి. మఱియు సిట్లె వివాదపడినవారెల్లరు విజితులుగాఁగ శ్రీ 'రాజమండ్రి' 'బందరు' 'సేలం' 'గోదావరి' న్యాయస్థానముల తీర్పులేగాక 'సతారా' 'పూనా' 'మద్రాసు' 'బొంబాయి' హైకోర్టులందును, 'తిరుచినాపల్లి' 'జన్నాహ్' 'తానా' 'మైసూరు' 'పటామ్' 'గంజాం' మొదలైన డిస్ట్రిక్టు మున్సభు కోర్టులందును నేర్పడిన తీర్పులున్నవి.

— (అరుణోదయ 1956 డిశంబరు.)

## విరాట్టు - లేక విశ్వకర్మ ఓం పరాత్పరుఁడు

(౧ బ్రహ్మ) (౨ క్షత్రియ) (౩ వైశ్య) (౪ శూద్ర)

"నా పేరు నందిగామ కాశీపతి; నేను బ్రాహ్మణుఁడను." (2వ ప్రతివాది)

''సానగ, సనాతన, అహభూన, ప్రత్న, సుపర్ణులను 5గురు ఋషులు ప్రతివాదుల జాతికిఁ బూర్వీకులు; వీరు బ్రాహ్మణులు - మా గోత్ర ఋషులందరు వీరి సంప్రదాయము'' (ప్ర॥ వా॥ 2వ సాక్షి య॥ ఆంజనేయశాస్త్రి)

''ఈ 5గురు వేదములోఁ జెప్పఁబడిన ఋషులే'' 'త్వష్ట' అని బ్రహ్మకు పేరున్నది'' వా॥2 సాక్షి శి॥ సీతా రామశాస్త్రి

''ఒక బ్రాహ్మణుని పేరు రథకారుండని కనంబడును''

''బ్రాహ్మణుఁడు తనకిష్టమైన వృత్తినవలంభించుటకు ప్రమాణంబున్నది'' (జడ్జిమెంటు)

''శిల్పమధ్యయనం నామ వృత్తం బ్రాహ్మణ లక్షణం'' (విశ్వబ్రహ్మ కులోత్సాహ)

''విశ్వకర్మ- బ్రా॥ వంశాగమము''

''నాది హారితసగోత్రము, మాకు అంగీరస, అంబరీష, యౌవనాశ్వ అని ముగ్గురు (క్షత్రియ) ఋషులు'' (వాది- జానపాటి పట్టాభిరామశాస్త్రి)

''నియోగులు పెడితే వైదికులు తినరు'' (వాది త॥ 2వసాక్షి శి॥ సీ॥ రా॥ శాస్త్రి)

''ముద్గలాచ్చమౌద్గల్యాః క్షత్రోపేతా ద్విజాతయో బభూవుః'' (విష్ణు పురా॥)

''నాభాగారిష్టపుత్రౌ ద్వౌ వైశ్యౌ బ్రాహ్మణతాం గతౌ. (హరివంశము)

''అబ్రహ్మణ్యే తదా దేశే కైవర్తాన్ ప్రేక్ష భార్గవః।...యజ్ఞసూత్ర మకల్పయత్॥ స్థాపయిత్వా స్వకీయే సక్షేత్రే విప్రాన్ ప్రకల్పితాన్॥ (స్కాం॥ స॥ ఖ॥)

''భట్టినీషు యథామాతా విదికా సుత వైదికాః। అత ఏవహి తేషాంచ భోట్లు నామ ప్రజాయతే'' (నామోత్పత్తి॥)

''జాతో వ్యాసస్తు కైవర్త్యాః శ్వపాకాస్తు పరాశరః। బహవో ఽన్యేపి విప్రత్వం ప్రాపితాః పూర్వమద్విజాః'' (భారతారణ్యపర్వము)

వ్యాసుఁడు పల్లెదానివలనను పరాశరుఁడు మాలెత వలనను బుట్టిరి. పూర్వము ద్విజులు కానివా రెందరో బ్రాహ్మణత్వమును పొందిరని అర్థము.

ఇంకను "ఇతర యుగములలో మాదిరిగా (వాదిజాతివలె) నీ కలియుగములో నొకజాతి (బ్రాహ్మణేతరులు) వారంతకంటె నుత్కృష్టజాతికి వచ్చుటకు వీలులేదనికూడ హైందవులు నమ్ము చున్నార"న్న జడ్జిమెంటులోని దృఢీకరణం బెంతటి యసంబద్ధం బైనదియో పాఠకులు గమనింతురుగాక.

ఈ కలియుగంబునం గొన్ని వందలయేండ్లక్రిందట 'బోయలు' "తిలఘాతకులు" అనంబడిన వారిప్పుడు వాది సమాన ఉత్కృష్ట జాతికి వచ్చియున్నట్లు తెలియంగల (శ్రీ) చిలుకూరి వీరభద్రరావు గారిచే *"(శ్రీ) రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక"లో ప్రచు రింపంబడిన చందలూరి శాసనచరిత్రాంశంబుల నిట నుదాహరించు చున్నాను. చూ॥

"సర్వలోకాశ్రయ మహారాజః కమ్మరాష్ట్రే) చెన్దులుగ్రామే। గ్రామేయకాన్ సర్వనైయోగికవల్లభాంశ్చ ఆజ్ఞాపయతి॥ ఏష గ్రామోఽస్మాభిః బ్రాహ్మణేభ్యః కౌండిన్యగోత్రేభ్యః । షట్కర్మ నిరతేభ్యః సతతావిచ్ఛిన్న (ప) జ్ఞ । మహాయజ్ఞక్రియేభ్యః । సుటారి వాస్తవ్యాయద్వే అంశే వంగ్రబోయాయద్వే । కొళ్ళిపుల్లూరి బోయా యద్వే పిదిన బోయాయద్వే । కురియిద బోయాయద్వే । కాళబవ బోత్రాయ(గోత్రాయ)కోదంకి బోమాయద్వేఅంశే॥ఏవమేతేభ్యః । బ్ర (హ్మ) దేయమర్యాదయా । సర్వపరిహారోపేతా దేవభోగహల వర్జ్యం।ఆయుర్బల విజయాభివృద్ధయే సప్తత్తః (సందత్తః) ఎపిగ్రాఫియా ఇండికాసం॥ పే ౨౩౬"

---

*ఇంకను "నియోగుల యిండ్లపేర్లు" వివరించి శ్రీ చిలుకూరి వీరభద్ర రావుగారే ప్రచురించిన ఈ క్రింది విషయంబులుగూడ నిట కాంచదగియున్నవి.

"నియోగిబ్రాహ్మణులు పూర్వము క్షత్రియులుగానుండుటచేతనే(నిస్సం దేహముగా,భట్రాజు, భీమరాజు, బొమ్మరాజు, పోతరాజు, పోలంరాజు, గంగరాజు, కామరాజు, అనంతరాజు, గవర్రాజు, గోపరాజు, తమ్మిరాజు, ఆదిరాజు,

"ఈ శాసనము క్రీ.శ. 673 సంవత్సరము మే 6వ తేదీని సర్వలోకాశ్రయునిచే వ్రాయించంబడినది. 120 సంవత్సరముల క్రిందట కమ్మరాష్ట్రములో షట్కర్మనిరతులును, సతతావిచ్ఛిన్న పంచ మహాయజ్ఞక్రియులును. కౌండిన్యగోత్రులు నగు వంబ్రోయ, కొళ్ళి పులబోయ, పిదినబోయ, కురియిదబోయ, కోదింకిబోయ యను బోయబ్రాహ్మణు లున్నట్లును వారు కుటూరువాస్తవ్యులయినట్లును సర్వలోకాశ్రయుండనియు, విజయసిద్ధియనియు బిరుదములనువహించిన మంగియువరాజు భూదానములు చేసినట్లు స్పష్టముగ దెలుపంబడినది. కమ్మనాడు వెలనాటిలోని యంతర్భాగమే కాని యన్యము గాదు. కరణబ్రాహ్మణులు తెలగాణ్యులలో నున్నట్లుగానె వెలనాటిబ్రాహ్మణులలో బోయబ్రాహ్మణులు గలరని విస్పష్టమగుచున్నదిగదా? మనదేశములో బ్రాహ్మణులలో తెలగాణ్యులను 'తిలఘాతకు' లని వెలనాటిబ్రాహ్మణులును, వైదర్భులు లేక 'బోయలు' అని తెలఘాణ్యులును పరస్పరము నెగతాళి చేసికొనుచుండుట(వైదిక నియోగాది)బ్రాహ్మణస్వభావ సంప్రదాయమునకు విరుద్ధమైన విషయముకాదు." (రా. రా. పట్టాభిషేకసంచిక)

వాది పలుసారులు "వైదికబ్రాహ్మణుడ"నని చెప్పికొనుచు తనగోత్రము "హారితయావనాశ్వ"అని క్షత్రియసంప్రదాయబుుషులను చెప్పియుండెను.

వాదితరపు 2వ సాక్షి శిష్ట్లా సీతారామశాస్త్రిగారు తను వైదికబ్రాహ్మణుండ" ననియు, తమతమ గోత్రబుుషులం జెప్పుచు "వశిష్టునిభార్య అరుంధతి చండాలస్త్రీ" యనియు, "అరుంధతి కుమారుండు శక్తి - శక్తికుమారుండు పరాశరుండు. శక్తి భార్యపేరు

అగస్త్యరాజు, అక్కిరాజు, అలరాజు, అంతరాజు, అల్లంరాజు, అమ్మిరాజు, అమ్మరాజు, అప్పరాజు, అబ్బరాజు, అక్కరాజు, కోటిరాజు, కాశిరాజు,

శ్వపాకి; అనఁగా కుక్కమాంసముతినేది అని అర్థ'' మనియు, ''శ్వపాకిజాతి సంకీర్ణజాతులలో అధమాధమ'' మనియు, ''పరాశరుఁడి కుమారుఁడు వ్యాసుఁడు. తపస్సే ముఖ్యమని చెప్పుటకు వ్యాసులవారు తన కులసంగతి చెప్పినాఁడ''నియు సాక్ష్య వాఙ్మూలంబునందు నిర్వచించియున్నట్టి రికార్డుగలిగియేయున్నది.

(ప్రతివాదులు కాని, (ప్రతివాదులతరపు 2వ, 11వ సాక్షులు గాని వాదిని (బ్రాహ్మణుఁడని ఒప్పుకొనియున్నట్లెక్కడనుకనుపట్టదు. కాగా తామే (బ్రాహ్మణులనిచెప్పుచు ''మేము షోడశకర్మలు చేయుచున్నామ''నియు, ''మేము వేదోక్తముగాఁ గర్మలుచేయుచున్నా'' మనియు, ''మామూలుగా విశ్వ(బ్రాహ్మణులు అని పిలువబడు మా (బ్రాహ్మణులలో షోడశకర్మలు చేయించువారున్నార'' నియు, ''(బ్రాహ్మణులమైన మేము సామాన్యముగా (గామపురోహిత్యము చేయ'' మనియు, ''అచ్చటచ్చట నీపౌరోహిత్యము చేయించు



వారున్నార'' నియు, (11వ సాక్షి) 'పెదగొట్టిపాటిలో నేను శివప్రతిష్ట చేసినా' ననియు, 'ఈదుమూడిలోను మా(గామమగు (ఒంగోలు తా॥) తక్కెళ్ళపాడులోను శివప్రతిష్ట చేసితి'' ననియు,

---

కొమ్మరాజు, కంచిరాజు, కాళంరాజు, కొప్పరాజు, కసవరాజు, కంఠంరాజు, గోవిందరాజు, గాలిరాజు, నేతరాజు, చెమ్మరాజు, చెన్నమరాజు, గుండ్రాజు, వల్లభరాజు, మల్లపరాజు, గాదిరాజు, బిరుదరాజు, బిజ్జిరాజు, సిద్ధిరాజు, చల్లంరాజు, చందరాజు, చాట్రాజు, తిమ్మరాజు, తల్లరాజు, తాతిరాజు, తల్లపరాజు,

'రావినూతలలోఁగూడ విష్ణుప్రతిష్ట చేసితి' ననియు, 'మమ్ము నెప్పుడును బ్రాహ్మణులనియే పిలుతు' రనియు, "బజారులో తెలియనివాండ్రు మాత్రమే విశ్వబ్రాహ్మణులని పిలుతుర"'రనియు, "నే నిదివఱకు కమసాల యని (కులము) పేరు వినలేద'నియు, 'అది యొక వృత్తిపే'రనియు ఖచ్చితంబుగా నిరూపించి చెప్పియున్న వాఙ్మూల రికార్డు కలిగియే యున్నదికదా !

ఈదావా దేవతలయొక్క ఆది ప్రతిష్ఠల నాగ్రామవాసి, విశ్వకర్మ - బ్రాహ్మణుండే యొనర్చియుండఁగా నది తెలిసియు తెలియనట్లు నిరూపించి చెప్ప నేరక సీవాది తప్పించుకొని - తుదకీ యపీలును త్రోసివేయుచు నదేయంశమునుకూడ జడ్జిమెంటులో నుటంకించియున్న సబ్ జడ్జిగారిపై నిందమోపి, విగతమనోరథంబునం జేయునదిలేక ప్రజలకు మొఱలిడుట పద్యము గాంచుడు.

(స్వా॥వ్యా॥ పుట 228).

" ఉ॥ ఎన్నఁడొ యాదికాలమున నీగుడులెవ్వరు కట్టఁజేసిరో
నిన్నటి వారికేమెరుక ? నేనది గట్టిగఁ జెప్పకున్న చో
నెన్నుచు దానిఁగూడ నొకహేతువుగాగ నపీలు త్రోసిరై
చెన్నరవర్యులార ! సబుజడ్జియు నేమి వచింతు మీకికన్.

ఎన్నఁడో ఆదికాలమున నంట ! నిన్నటివాఁడట !! ఎంతటి మోసం బిది ? అదే దేవాలయంబుల పెత్తనదారియు, మోద్బరిపైతును

తమ్మిరాజు, దామరాజు, దేచిరాజు, దేశరాజు, దేవశ్రీరాజు, ద్రోణంరాజు, దొంతరాజు, దుర్గిరాజు, ధన్యంరాజు, దేశిరాజు, ధణ్యంరాజు, అయితరాజు, నందిరాజు, నారపరాజు, నీలంరాజు. పెమ్మిరాజు, పున్నమరాజు, పెద్దిరాజు, పిన్నమరాజు, పోచిరాజు, పబ్బరాజు, ప్రగడరాజు, భావరాజు, బుధరాజు, బుద్ధిరాజు, బసవరాజు, భోగరాజు, భద్రిరాజు, బాచిరాజు, బయిర్రాజు, మాచిరాజు, మంచిరాజు, ముద్దరాజు, ముత్తరాజు, మాదిరాజు, మల్రాజు, మదిరాజు, యాగరాజు, రామరాజు, రాచిరాజు, బక్కరాజు, వేమరాజు, వేనరాజు, వీరం

నైన ఉన్నము చినవీరయ్య యను (58 సంవత్సరంబుల వయస్సు గల) వ్యక్తి "నేను 16 సంవత్సరముల వయస్సున నుండఁగా నంది గామ చెన్నమల్లయ్య యను విశ్వబ్రాహ్మణుం డీ రెండు దేవతలను ప్రతిష్ఠించెను' అని కోర్టులో తనసాక్ష్యమున ఋజువొనర్చియున్న రికార్డు కనంబడుచున్నదికదా!

ఆగ్రామస్థులకందరికిన్ని తెలిసియున్నవిషయం బీవాదికొక్క నికి తెలియకపోవుటెట్లు? ఈ మండూకప్లుతివలన నిట్టివారు ఆసేతు హిమగిరి పర్యంత మహాస్థలంబు లందలి దైవమూర్తులను విశ్వకర్మ బ్రాహ్మణులే ప్రతిష్ఠించిరన్న విషయము నెఱింగియున్నను ఆనిజ మును నిర్వచింపజాలరనియె తెలియంగలుగుచున్నది. ఐనను సత్యం బెట్టులైనను బయటబడకపోదను నార్యోక్తిగా నీవాదియే తనసాక్ష్య ములో నీ దావాకు పూర్వము "యీగుంటూరుజిల్లాలో వైదికులు ప్రతిష్ఠలు చేయించగా చూడలేదు" అని ఖచ్చితంబుగనే చెప్పి యుండెను. బహుకాలమునకు పూర్వ మీప్రతివాదుల పూర్వులు బ్రాహ్మణులను లిఖితపూర్వక 'కారిక' యింటచేతనేనని బ్రాహ్మణో త్పత్తిమార్తాండ రచనమునుగూర్చి ఇతఁడే వ్రాసియుండిన పద్యం బిచ్చటనూ గాంచదగినదిగనే యున్నది. చూ॥

**తే॥ మాదిబ్రాహ్మణవర్ణమన్ మాట వీరు, మొదలు పెట్టిరిబహుకాలమునకుమున్నె**
**కాన దల్లిఖితంబుతో కారికలెవో, దొరికి హరికృష్ణుడందులో దూర్చవచ్చు.**

ఇట్లు నిర్వచించిన యీవాదియే మఱల స్వవచనవ్యాఘాతముగా నీ

---

రాజు, విఠంరాజు, వందిరాజు, శివరాజు, శంబిరాజు, సింగరాజు, సీతంరాజు, సన్నిరాజు, సత్రాజు, సత్తిరాజు మొదలగునవి యింటిపేరులు వ్యవహారములో నికి వచ్చునవి. యల్లాప్రగడ మంత్రిప్రగడ చిట్టాప్రగడ......నామములతో నేర్పడియున్నవి...రాజరాజనరేంద్రుని పట్టాభిషేక వర్ధంతిసందర్భమున చాళు క్యుల ప్రశంస గలిగినప్పుడు మహారాజశ్రీ బిరుదాంచితులగు నియోగి బ్రాహ్మ ణుల చరిత్రను చెప్పవలసి వచ్చిన"ది.(రా.రా. పట్టాభిషేకసంచిక 104 పుట.)

క్రింది పద్యములో వాక్రుచ్చుట ఎంతటి యకృత్యమో పాఠకు లూహింతురుగాక.

గీ॥ బ్రాహ్మణులము మేమటంచు నీబత్తులెల్లమి, వాదములు సేయనయ్యది వలదటంటి
వట్టివాదు లెకాక మాయూళిలో బ్రతిష్ఠయే చేయ వ్యాజ్యంబు దెచ్చియుంటి.

వేదాది ధర్మశాస్త్రములైన కారికలలో ప్రతివాదుల పూర్వులు బ్రాహ్మణులని యుండ నితం డిప్పుడు వలదన్నంతమాత్రమునం బ్రయోజనంబేమి? విష్ణు, యీశ్వరాది సమస్త దైవమూర్తులను ప్రతిష్ఠింపనగువారు ప్రతివాదులేయని కారికలుండ సామాన్యగ్రామ దేవతల ప్రతిష్ఠలనుగురించి దావా తెచ్చుట ఎంతటిఘనకార్యము?

ఇతరులను గష్టపెట్టుటకే యుద్దేశింపబడినదని అడిషనల్ డిష్ట్రిక్టు మున్సిఫుగారున్నూ; 'ఇతరులను నష్టపెట్టుటకైనను కాక పోయినను యీదావా మంచి సలహాలతో జేయబడినట్లు లేదని' సబ్ జడ్జిగారున్ను వ్రాసియేయున్నారుకదా! ఈ దావాలో సర్వ విధముల దిగ్విజయము నొందగలిగిన ప్రతివాదులు యీ వాదిపై తిరిగి డిఫర్ మేషన్ సూటు వేయక ఉపేక్షించియున్నందుల కెంతయు వారి యౌదార్యము పొగడందగినదియె యైయున్నది.

వాదివలె స్వార్థపరత్వముచే 'స్వల్పశంకంబూని' పరశురామ ప్రతిభ న్వాలింగించుచు రాను రాను 'బ్రాహ్మణ' పదప్రయోగమును గుత్తగొన్నట్లు వ్యవహరించుకొనుటచే కృత్రిమవజ్రములను వేరు పరుప అసలువజ్రములను 'అసలు' అను నుపపదప్రయోగముచే వాడవలసివచ్చినట్లు మనోవాక్కాయకర్మలయందాదినుండి బ్రాహ్మణులైయున్న ప్రతివాదులసంఘమువారు 'బ్రాహ్మణులు' అనుటంతో పాటు 'విశ్వకర్మ' బ్రాహ్మణులనియు, విశ్వ-బ్రాహ్మణులనియు, శిల్పబ్రాహ్మణులనియు పిలువంబడజొచ్చిన స్లైరుంగునది.

ఆంధ్రసామ్రాజ్య చతుష్కస్థాపనకు నాందియైన శాతవాహన సామ్రాజ్య వైరి నిర్జిత యశోరక్షణాది సవిస్తరణకు కారణభూతుండైయున్న స్వార్థరహిత దేశసేవా దక్షుండైనట్టి. (ప్రతినాదుల వంశసంభవుడైన 'ధర్మనందులవా'రను 'శిల్పబ్రాహ్మణుని' పుత్రుండు 'సువర్ణశ్రీ' యను మహాశయుండేయగుట- ఆ నిర్దుష్ట చరిత్రాత్మక 'హిమబిందు' అను కీ. శే. అడివి బాపిరాజుగారి వచనరచన గ్రంథ రాజము వలనం దెలియంగలదు.

ఉన్నతవిద్యార్థులకొఱకై సంగ్రహముగా క్రౌను 1/8 సైజు 244 పుటల గ్రంథమునుకూడ రచించి ప్రచురింపించియుంటచే యామహనీయునకు కృతజ్ఞతం దెలుపుచు నాకథానాయకుండేయనం దగిన యువక 'శిల్పబ్రాహ్మణు'ని దేశహితాభిమాన శౌర్యోదార ధీరతల నెఱింగింప నందలి ముఖ్యఘట్టములలోని సంభాషణాదిక చరిత్రాంశంబుల నిట నుదాహరించుచున్నాను. 'ధర్మనందుల వార'ను 'శిల్పబ్రాహ్మణుఁడు' తనపుత్రునితో నేమనుచున్నాఁడో చూడుఁడు.

'ధర్మనందులవారు:- రేపు సార్వభౌముల జన్మదిన ఖేలనోత్సవములకు వెళ్లుదువా?...బాబూ! ఎడ్లబండితోలుట ఎపుడు నేర్చితివిరా? నీ కీ పందెపు గొడవలెందుకురా?...మన శిల్పవిద్య భగవత్ప్రీతికరము. తథాగతునిగాథలు శిల్పంలో రూపించి నిర్వాణమార్గ సోపానాలు కట్టే శిల్పమెక్కడ? వీరవిద్య లెక్కడ?...సరే కానిమ్ము, ఇపుడు వెనుదీయుట యుక్తము కాదు. విజయుడవై, క్షేమముగా తిరిగిరమ్ము....(పుట 6)

'పిమ్మటఁ జక్రవర్తి పీఠముప్రోల విజయపీఠముపై సువర్ణశ్రీ నధివసింపంజేసి...సార్వభౌముఁడు మొదలగువారా వీరకిశోరుని శిరమున సువర్ణాక్షత లొలికిరి'. (పుట 26)

'సమవర్తి:- సువర్ణశ్రీ ఎంతపనిచేసినాఁడు! బండిపందెముల నెగ్గిన ఆ బాలుం డింతటి వీరుండనుకోలేదు.'... (పుట133)

'గోండుఁడు:- ఇంతటితోనయినదా? ఇంతకంటె మించినవార్త తెచ్చానుదొరా! ఆ కొండగుహాలను మేము పిమ్మట పట్టుకొని గాలించి, చక్రవర్తి కుమారుఁడు - చిన్నదొర - మంజుశ్రీ నందు కనుగొంటిమి. వారు సుకమున్నారని మాదొర(సువర్ణశ్రీ యను 'శిల్పబ్రాహ్మణుఁడు') మీకు తెలుపమన్నారు. (పు134)

'శుకబాణుఁడు:- ఏమిటి? (అని అదిరిపడి) సువర్ణశ్రీ! మొన్నటి బాలుఁడవు. ఎంతపనిచేసినావయ్యా. నాచారసేనల కసాధ్యమైనపని గోండుల సహాయముతో ఇట్లె సాధించితివి. ఆంధ్ర సామ్రాజ్యము నీ ఋణమెట్లు తీర్చుకొనును'. (పుట 134)

'వివాహామైన కొలదిదినములకు సుర్ణశ్రీని చక్రవర్తి పాటలీ పుత్రమున ఉత్తరాంధ్ర సామ్రాజ్యమునకు రాజప్రతినిధిగా నభిషే కించెను', (పుట 241)

'పాటలీపుత్రమును పాలించు సువర్ణశ్రీ కోసలదేశమున స్తూపము నొక గోపురము స్వయముగా విన్యసించి యర్పించెను.' 'అతిలోకసుందరమై మహాద్భుత శిల్పవిన్యాసరూపమై ఆర్యావర్త మంతయు విలశిల్లిపోయినది. సువర్ణశ్రీ శిష్యులు గాంధార, పార సీక, కొహారస్థాన; బాహ్లికాది దేశములకేగి ఆంధ్రశిల్ప చిత్రలేఖ నాదులు విలసిల్లఁజేసిరి'. 'ఆంధ్రసామ్రాజ్యమును వేయికన్నుల గాపాడుచు పాటలీపుత్ర ధాన్యకటకముల మధ్య దిరుగుచుండెను.' (పుట 142)

'హిమబిందు:- ఆత్మేశ్వరా! ఏమట్లు మీరు అత్యంతతీవ్రాలోచనా ధీనులై యున్నారు?

సువర్ణశ్రీ:- జీవితేశ్వరీ! నాకీ రాజ్యభార మెందులకు? ఏదియో శిల్పము చేసికొనువానికి.

హిమబిందు:- పాటలీపుత్రమును జయించి చక్రవర్తి స్వాధీనము చేయునాఁడు మీకీ ఆలోచన లేదూ?

సువర్ణశ్రీ:- ఆపని చక్రవర్తికై చేసితిని.

హిమబిందు:- ఇదియు చక్రవర్తికై కాదా!... (పుట243)

ఆహా! ఇది ఎంతటి స్వార్థరహిత దేశసేవయని చెప్పవచ్చును? ఇట్టి ఉత్తమోత్తమ చరిత్రమును పండిత పామరజన విదితముగా నావెలు శైలిని వ్రాయగలిగిన శ్రీశ్రీ కీ॥ శే॥ అడివి బాపిరాజుగా రెంతయు స్మరణీయులు.

సర్వదా, సర్వమానవాభ్యున్నతికై వేదశిల్పాది విద్యాప్రదాతలైయున్న (ప్రతివాదులసంఘు) బ్రాహ్మణులపై అసూయ గల్పింప - అల్పత్వముచే శ్రుతి స్మృతి విరుద్ధముగా వాకృచ్చు 'స్వర్ణకారవ్యవహారము' అను గ్రంథమువంటి అనర్థకసముదాయము కృతఘ్నతచే దేశారిష్ట. ఘోరప్రమాదములకే దారితీయంగలవు కావున నట్టివానిని తఱచి తఱచి నిజము నిఱూపింపంగలుగు నీ విజయధ్వజి-గుంటూరుజిల్లా తీర్పులు (అధ్వర్యవ్యవహారదర్పణము) ఎల్లయెడల వ్యాపించి స్వచ్ఛంద దేశహితాభ్యున్నతి కుపబలంబగుగాక యని విశ్వసించుచు నీ వ్యాసంగంబింతట ముగించుచుంటిని.

ఇట్లు

దేశహితప్రదీపికాది బహుగ్రంథకర్త దేశభక్తబిరుద విభ్రాజమాన మాననీయ బుధజనవిధేయ సుబ్రహ్మణ్యశర్మ విరచిత విజయధ్వజి సర్వము సంపూర్ణము.

ఓమ్ తత్సత్

# అమూల్యాభిప్రాయములు

బ్రహ్మశ్రీ దేశభక్త వి. యస్. శర్మగారిచే రచింపంబడిన "దేశహితప్రదీపిక"ల విషయసూచీపత్రము చదివినప్పుడే ఏతద్గ్రంథ సంపుటిని మననము చేయవలెనని కౌతుకముదయించెను. వ్రాయుటయ తడవుగా ప్రాతచందాదారుల యొద్దనున్న ప్రతులను సేకరించి పంపిరి. అందు అనేక దృష్టాంతరములతో నున్న చరిత్రలను చదివి నాలో నంతకుముందున్న తప్పు అభిప్రాయముల సరిదిద్దుకొని ఆనందించితి.

"విజయధ్వజి" అచ్చు కానందుకై వగచితిని. నాకుటుంబ ఖర్చునైన తగ్గించి అట్టి మిగులును గ్రంథముద్రణకై సహాయము చేయ నిశ్చయించుకొని అటులనే ఉడుతాభక్తిగ యధోచిత సహాయము చేయుటయందు సఫలీకృతుడనైతిని.

విజయధ్వజి కొన్ని పుటలు చూచినతోడనె కౌతుకము ద్విగుణీకృతంబైనది. శ్రీ శర్మగారివంటి దీక్షాపరులు, ప్రజ్ఞాధురంధరులు, సత్యాన్వేషకులు ఇట్టి వెన్నో గ్రంథరాజములు చారిత్ర సామగ్రితో ప్రకటింపగలరని ఆశించుచున్నాను....

ఓం కృణ్వంతు మార్యం.

నివాసం_కాసనగోడు
నల్లగొండఫిర్కా_డిటూతా॥

యన్. పాపయ్యశాస్త్రి
డిప్యూటిఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్-రేంజి-జగత్యాల

శ్లో॥ అవైదిక ప్రలాపానాం నిర్మూలాయైవ కేవలం।
సుబ్రహ్మణ్యేన విదుషా రచితో విజయధ్వజీ॥
ఇమం పఠన్త శ్రుణ్వంతో వైమర్శిక్యా ధియా సకృత్।
యాథార్థ్యం ప్రవిజానన్తః ప్రకాశన్తే జనాధ్రువం॥

శ్రీ శారదానికేతనం
గుంటూరు.

'విద్యాప్రవీణ' మునుగంటి కృపాచార్యులు
సంస్కృత పండితులు

బ్రహ్మశ్రీ దేశభక్త వోలేటి సుబ్రహ్మణ్యశర్మ కృత 'విజయధ్వజి' సర్వత్ర దేశసౌభాగ్యోన్నతులకై స్వార్థరహితసేవ యొనర్చగల్గిన సంఘమును గుర్తింపజేయుట కేర్పడిన సుప్రసిద్ధ చరిత్రాత్మక గ్రంథరాజమై యున్నది. దీనిప్రయోజనము అనుదిన పరిభాషలోకూడ గలుగంగలదు. ఎందువలన నన.

ప్రపంచమునందన్ని చేతనాచేతనములకు చరిత్రయున్నది. సమస్తజీవులకు వాని సంఘములకు సమయ, సంస్కార పురస్సర మగు చరిత్ర పెంపొందుచునే యున్నది. మానవుని చారిత్రిక జీవనము దేశకాల పరిస్థితులవలన హెచ్చుతగ్గులతో గూడినదై యగుచున్నను ఆయా నైతికచరిత్ర విస్మరింపక పునఃగమించుట నేలవిడచి సాము యొనర్చుట వంటిదే యగును.

సంపూర్ణ ప్రపంచైక్యములోకూడ 'మా హిందూదేశ చరిత్రము సర్వవిధముల మేలైనది' యని ప్రధాని పండిత శ్రీ జవహర్ లాల్ నెహ్రూవంటి మహామహులు పలుకుటలో గల మహత్తర విశేషము 'మా' 'మా' అని చెప్పంబడు పవిత్ర చరిత్రంబుల కన్నింటికి వర్తించుచునేయున్నది.

సృష్టి, స్థితి, లయాదుల కావశ్యకంబులగు కర్మ - అనగా శైల్పిక, యాజ్ఞిక, గ్రామకరిణీకము మొదలు రాజ, రాజప్రతినిధివరకు స్వార్థరహితపాలన మొనర్చియున్న విశ్వకర్మ - బ్రాహ్మణ సంఘమును గమనింపని స్థితిలో లోకంబున్నప్పుడు మాచరిత్రంబిట్టిది, దురాక్రమణదారుల చరిత్రంబిట్టిది యని తెలుపంగల్గిన విశిష్టతగల చరిత్రావసరం బెంతగలదో ప్రాజ్ఞు లెఱుంగనిదికాదు.

ఒకప్పు డేర్పడిన యభియోగంబున కోర్టులో పెట్టియున్న 'ఆన్సరు' నిరూపింపబడిన గ్రంథసాదృశ్యాలు, సాక్షులై పలికిన

వాఙ్మూలముల ప్రతి లిపి, విజయచిహ్నంబైన తీర్పు, అప్పీలుతీర్పుల సారాంశములు కరతలామలకముగ ప్రకటింపజాలని లోటుఁ దీర్చుటయగాక– ఆ 'విజయ' మువిజయముగ ప్రకటించినవారి దుర్ణయ వాతూలంబును తుదముట్టింపగలట్టి సాటిలేని మేటిచరిత్రయైనదే 'విజయధ్వజి' అని ప్రశంసింపక తప్పదు

దుర్ఘట ప్రయత్నంబులలో తమ సర్వస్వము ధారపోసి విజయులైన వారిలో కీ॥ శే॥ పండిత మార్గసహాయాచార్యులు, మధురాచార్యులు, మూణాంపతి అప్పకణ్వాచార్యులు. కనుపర్తి బసవాచార్య స్వాములవారు, సాహిత్యసింహ యలవర్తి ఆంజనేయ శాస్త్రి, మహోపాధ్యాయ వడ్డెపాటి నిరంజన శాస్త్రి, పండిత గానాల రామమూర్తి (ఎం.ఎల్.సి. అండ్ ఎఫ్. ఎం. యు) పండిత గొన్నాభక్తుల వరహానరసింహాచార్యులు, పండిత దంతనాల నాగేశ్వరశాస్త్రి, పండిత వెల్లటూరి శేషాచలావధానులు మున్నగువారేగాక జగద్గురు శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారు, శ్రీ సనారీ విశ్వేశ్వర స్వాములవారు (సింహాద్రివిశ్వనాథావధూత) చిరస్మరణీయులు.

మనుగడకు కెన్నో రీతులున్నా! సాంఘికచరిత్ర ప్రచురణమే తమ ఏక లక్ష్యముగ పెట్టుకొని ప్రాచీనార్వాచీనచారిత్రక గ్రంథ భాండాగార పరిధిలో 'విజయధ్వజి'ని వెలయించిన శ్రీ దేశభక్త వి. యస్. శర్మగారి వంటి చరిత్రకారులను పోషింపకలిగిననాడే స్వసాంఘికులెల్లరు ఋణవిముక్తులగుదురని తెలియంగల్గుచున్నది.

విజయవాడ
16–11–1957

సర్వసిద్ధి సూర్యనారాయణ కవి,
సర్వసిద్ధి శిల్పనిలయం.

—*—

శ్లో॥ ధీమతో దేశభక్తస్య శ్రీ సుబ్రహ్మణ్యశర్మణః,
సత్యార్థ సాధకోయత్న స్సాఫల్య మధిగచ్ఛతు.

వి. యస్. ఆర్. కళాశాలా,
తె నా లి.
20—11—57

ఇతి శమ్
ప్రత్నసగోత్రో వీరరాఘవాచార్యః
ఆంధ్రోపన్యాసకః



I have great pleasure to go through this book, brought out by Mr. V, S. Sarma.

The History of Silpabrahmins, which added the most valuable treasure to Indian Culture from times immemorial, has been so authoritatively and briefly illustrated in this small volume.

To the earnest min d which desires to search for the way of the Vedic History of Silpabrahmins, I believe, this Vijayadhwaji is the flag of victory, hoisted by Mr. Sarma.

20th. Nove. 1957,
Guntur.

**V. V. L. Narasimha Rao, M. A.**
Lecturer in Telugu.
A. C. College. Guntur.

